అక్టోబరు 1976



సంపుటి: 14
సంచిక. 9

సచిత్ర మాసపత్రిక

సంస్థాపకులు :
కీ. శే. వి. వి. రాఘవయ్య

మేనేజింగ్ ఎడిటర్ :
శ్రీమతి వి. లీలావతి రాఘవయ్య

సహకార సంపాదకుడు : వేమూరి సత్యనారాయణ

# విషయసూచిక



నవలానుబంధం

## పెళ్ళయ్యాక చూడు—వసుంధర

గీతా కృష్ణా కంబైన్స్ 'సిరిసిరిమువ్వ'లో జయప్రద

జ్యోతి, 40/1 మూసాసేట్ స్ట్రీట్, టి. నగర్, మద్రాసు-600017.
ఫోన్: 440548. సంవత్సర చందా (ప్రత్యేక సంచికతో) రు. 42/-.

# తొలిమాట

మహాకవి శ్రీశ్రీ నిర్వహించు 'పదబంధ ప్రహేళిక' శీర్షికకు ఎంట్రీలు చాలా అధిక సంఖ్యలో వచ్చాయి. ఈ శీర్షిక ఎడల పాఠకులు చూపే ఉత్సాహానికి ఆనంద పడుతున్నాము. ఈ సందర్భంలో ఒక చిన్న మనవి. శ్రీశ్రీగారి దృష్టిలో ఈ శీర్షిక ఒక పోటీగా చెప్పదగినది కాదు. 'బ్రెయిన్ టీజర్'గా వర్ణించారాయన ఈ శీర్షికను. భాషాజ్ఞానమొక్కటే కాక ఆలోచనా పరిధికూడా విస్తృతంగా అవసరమైన ఈ శీర్షికలో గళ్ళ నుడికట్టు కష్టంగా ఉందన్న కారణంగా పాల్గొన నిచ్చగించని పాఠకులు కూడా సాధ్యమయినంతవరకూ ప్రయత్నంచేసి. పూర్తిగా గళ్ళను నింపలేకపోయినా, పూర్తి చేసినంతవరకూ [అదీ శ్రీశ్రీ కూర్చిన ప్రహేళిక!] సరిగా ఉన్నదా లేదా చూసుకోవడంలో కూడా ఎంతో గొప్ప అనుభూతి ఉంది. ఇంకా ఇంకా పాఠకులు ఈ శీర్షికవైపు ఆకర్షితులవుతారన్న నమ్మకం మాకుంది.

* * *

ఇంతకాలంగా మిమ్మల్ని ఆకట్టుకొన్న సీరియల్ 'మిస్టర్ సంపత్ ఎం. ఏ.,' నవంబర్ సంచికతో ముగుస్తుంది. మీరు మెచ్చే మరో చక్కని సీరియల్ గురించిన ప్రకటన వచ్చే సంచికలో చూడగలరు,

* * *

ఈ సంచికలోని 'నవల' గురించి ప్రత్యేకంగా ప్రస్తావించాము, ఆ నవల తొలి పేజీలో. 'న్యూవేవ్' రచనలూ, 'మిరాయిల్లాంటి' రచనలూ ప్రచురిస్తున్నామంటూ పాఠకులను ఊరించడం ప్రధానంగా గాక—అర్థమున్న రచనలూ, వైవిధ్యమున్న రచనలూ ఎన్నికచేసి మా పాఠకుల కందించడం మా ప్రధాన బాధ్యతగా భావిస్తున్నాము. ఈ నెల 'నవల'గా ప్రచురించిన 'పెళ్ళయ్యాక చూడు' మా దృష్టిలో కొత్త రకం రచనగానే భావించాము. 'వసుంధర' అందించిన ఈ రచనపై పాఠకులనుండి ప్రత్యేకంగా అభిప్రాయాలు కోరుతున్నాము.



# ఎండా వానల భయం లేదు

ఎవరు ఎన్ని నిర్వచనాలు చెప్పినా మన దేశంలో సామాన్య ప్రజలందరికీ తినడానికి తిండి, కట్టుకోను బట్టా, ఉండడానికి యిల్లూ ఏర్పాటు చేయడం—యిదే సోషలిజం.

ఒక పూట పస్తుండవలసి వచ్చినా తట్టుకోవచ్చుగాని చెట్టుక్రింద జీవితాలు గడపడం మాత్రం ఈ రోజుల్లో దుర్భరం.

మన గ్రామీణ ప్రాంతాల్లో సొంతయిల్లులేని కోట్లాది ప్రజలకు ఏదో విధంగా తలదాచుకొనే వసతి కల్పించడం తక్షణ కర్తవ్యం.

కొందరు యితరుల స్థలాల్లో యిళ్ళు వేసుకుని వుంటూ వుంటారు. భూస్వాముల పొలాల్లో యిళ్ళు వేసుకుని జీవిస్తున్న వారూ వున్నారు. ఇల్లు తనదేకాని స్థలం తనది కాదు. ఏ క్షణాన అయినా భూస్వామి లేచి పొమ్మని బలవంత పెట్టవచ్చు. అందువల్ల ఆ విధంగా యిండ్లు వేసుకొని వుంటున్న వారికి ఆయా స్థలాలమీద యాజమాన్యం కల్పిస్తూ మన రాష్ట్రంలో శాసనం చేశారు. ఈ విధంగా 35 వేల కుటుంబాలు లాభపడుతాయి.

గ్రామీణ ప్రాంతాల్లో పేద వర్గాల వారికి మాగాణిభూమి అయితే మూడు సెంట్లు, మెట్ట అయితే 5 సెంట్లు యిండ్ల స్థలాలుగా మంజూరు చేస్తున్నారు. 1975 జూన్ నాటికి 1,95,000 కుటుంబాలకు యీ ప్రయోజనం చేకూరింది. 20 సూత్రాల కార్యక్రమం ప్రకటించబడిన తర్వాత దీనికోసం బడ్జెట్ కేటాయింపు రు. 1½ కోట్ల నుండి రు. 2½ కోట్లకు పెంచారు.

భూమి సేకరణ చట్టంలో మార్పులుచేసి, కలెక్టర్లకు అదనపు అధికారాలు యిచ్చారు.

1975 ఏప్రిల్ నుండి నేటి వరకు 4 లక్షల 66 వేల కుటుంబాలకు యిండ్ల స్థలాలు యిచ్చారు. మొదట్లో అనుకున్న లక్ష్యం 3 లక్షల కుటుంబాలు

---

సమాచార, పౌరసంబంధ శాఖ, హైదరాబాదు

DIPR 13/76-77



చిత్రభాను ప్రొడక్షన్స్

# వధూవరులు



# లేఖావళి

శ్రీశ్రీ నిర్వహించు "పదబంధ ప్రహేళిక" మాకు నచ్చింది. కాని ఎక్కువ మంది విజేతలున్నప్పుడు లాటరీ వేసి ఒక్కరికి మాత్రమే బహుమతి ఇవ్వడము చాలా అన్యాయము. అలా కాక ఎంతమంది ఆల్ కరెక్టుగా వ్రాస్తే అంత మందికీ బహుమతిని పంచి యివ్వడము సబబుగా వుంటుందని మనవి జేయుచున్నాను.

—ఎన్. సాయికృష్ణప్రసాద్, హైదరాబాదు-34.

[మీ సూచనకు కృతజ్ఞులము. అయితే 'నిఘంటువు' బహుమతిగా ప్రకటించాము. అది ఒక్కరికే ఇవ్వడం సాధ్యమవుతుంది. 'పదబంధ ప్రహేళిక' ఒక్క తప్పు లేకుండా పూరించి పంపినవారిలో బహుమతి గెలుచుకొన్నవారితో పాటు మిగతా అందరికీ బహుమతులు ప్రకటించిన జ్యోతి సంచికను ఉచితంగా పంపిస్తున్నాము.]

సెప్టెంబరు నెల "జ్యోతి" ముఖచిత్రం చాలా బాగుంది. సీరియల్స్ "మిస్టర్ సంపత్, "జై మంగళా"లు చాలా ఇంట్రస్టింగ్‌గా సాగిపోతున్నాయి. మీరు అందించిన నవలానుబంధంలో "పాలకోడేటి సత్యనారాయణరావుగారి" స్వయంవరం చాలా బాగుంది.

—కె. సుంకయ్యగుప్త, అనంతపురం.

"పొగరుబోతు ... ్యతి'
బరు సంచిక అందంగా వెల
దీన్లో "నవరసాల శ్రీశ్రీ" .
బాగుంది. నవలానుబంధంలో ఉన్న రెండు నవలికలకు గంగాధర్‌గారు వేసిన బొమ్మలు, ఆఖరి పేజీల్లో సినిమా విషయాలు చూడ్డానికి, చదవడానికి ఆసక్తిని కలిగించాయి. కథలు, మినీ కథలు, కవితలు బావున్నాయి. మళ్ళీ ఇరవయ్యో తారీఖు ఎప్పుడొస్తుందా అని ఎదురు చూడ్డం అప్పుడే మొదలుపెట్టాను. తెలుగు సాహిత్యంకోసం "జ్యోతి" తీసుకుంటున్న శ్రద్ధకు సంతోషం.

—యోగీశ్వర్రావు, రాజోలు.

"నవరసాల శ్రీశ్రీ" శీర్షిక అత్యద్భుతముగా వుంది. అరికెపూడి (కోడూరి) కౌసల్యాదేవిగారి "సత్యం - శివం - సుందరం" సీరియల్ చాల జోరుగా సాగుతుంది. "శ్రీరాజ్"గారి "ఇది ఉన్నవాళ్ళ కథ" చాల బాగుంది.

—మన్‌మోహన్ ధోండి, ఆర్మూర్.

ఈనెల కథలలో పులుపు కథ చాల బాగుంది. అరికెపూడి కౌసల్యాదేవిగారి "సత్యం శివం సుందరం" మరియు "జై మంగళా" సీరియల్స్ మా హృదయాలను పరవశింపజేస్తు ముందుకు పరుగెడుతున్నవి.

—పిరికొండ వెంకటేశం, కరీంనగర్.

"జ్యోతి" సెప్టెంబరు సంచిక చదివాము. మంగళ పాత్రను అద్భుతంగా రూపొందిస్తున్న రచయిత్రికి నా అభినందనలు. "ఇది ఉన్నవాళ్ళ కథ" నా కెం. నచ్చింది. ఉన్నవాళ్ళ ఇంటి గౌర..

మహాకవి శ్రీశ్రీ రచనల ప్రత్యేక శీర్షిక !



# నవరసాల శ్రీశ్రీ

## అరవంలో కోడిగుడ్డు

మా తాతగాడు, అనగా నా దౌహిత్రుడు ఇంగ్లీషుమీడియం స్కూల్లో చదువు న్నాడు. ఇంగ్లీషులో, లెక్కల్లో ఇంకా తర సబ్జెక్టులలో ఎనభై లూ, తొంభ లూ తెచ్చుకుంటాడు. ఒక్క అరవంలో మాత్రం కోడిగుడ్డు తెచ్చుకుంటాడు.

"ఒరే, వాడపల్లి వెంకట సుబ్రహ్మణ్య నివాసరావూ!" అని వాణ్ణి పూర్తి పేరు ట్టి పిలిచి "అరవంలో గుండు సున్నా ందుకు వచ్చిం"దని నే నడిగితే మిగిలిన టిలో ఎన్ని మార్కులు తెచ్చానో డమంటాడు, "అది సరే, అరవం వ్వంత బాగా మాట్లాడుతావు కదా, టలు కూడా జమాయించి పాడతావు నా సున్నా ఎలా తెచ్చావురా" అని మళ్ళీ డిగితే ఈసారి మంచి మార్కులు స్తానన్నాడు.

కాని మళ్ళీ కోడిగుడ్డే! పోనీ అరవం నేసి మరేదయినా, మాటవరసకి - గు, తీసుకోరా అంటే వాడు ససే మిరా ఒప్పుకోలేదు. అరవం రాదు. తెలుగు వద్దు! అదీ సంగతి.

కొన్నాళ్ళ దాకా ఇందులో ఉన్న తిరుగు డేమిటో నాకు అంతుపట్టలేదు. తర్వాత వాడి చేతిలో ఒక పలకా, బలపం ఉంచి అరవం అక్షరాలు రాయ మన్నాను. అ ఆల దగ్గరే వాడు ఆగి పోయాడు. ఆ అక్షరాలలోని అల్లి బిల్లి మెలికలే వాడి తికమకలకి కారణం అని అప్పుడు తెలుసుకున్నాను.

నాగర లిపీ, రోమన్ లిపీ మా తాత గాడికి కొట్టిన పిండి. ఇంగ్లీషులోని నాలుగు బర్లూ అవలీలగా రాసేస్తాడు. అరవం దగ్గరకి వచ్చేసరికే వాడి ఇబ్బంది లారంభమవుతాయి.

తెలుగులో అ ఆ ఇ ఈ అని రాసిచ్చి దిద్దమన్నాను. ఇంతలో వాళ్ళ నాన్న వచ్చి అ ఆలు చెరిపేసి "ఓం నమశ్శివాయ" అని రాశాడు. "ఓహో గుంటఓనమాలు దిద్దడం మన సంప్రదాయం కదా!" అని

## ఈ నెల హాస్యరసం

గ్రహించాను

అప్పుడిక పలకా బలపం దేనికి? ఇంత ఇసక తెప్పించి వేలితో "ఓం నమ శ్శివాయ" అని రాసి తాతగాడి కుడి చేతి చూపుడువేలితో దిద్దించాను ఆ విధంగా తెలుగులో అక్షరాభ్యాసం నేనే చేయించాను వాడికి.

మళ్ళీ పలకమీద అ ఆలు రాసి దిద్దమంటే తెల్లమొగం వేశాడు పోనీ అరవ అక్షరాలు రాయమన్నాను కొంతసేపు బలపంతో ఏవేవో మెలికలు తిప్పి కొంత నాసిరకపు నైరూప్య కళ సృష్టించాడు కాని అక్షరాల పోలిక మాత్రం అందులో ఎక్కడా కనిపించలేదు

KAAKI అని నేను రోమన్ లిపిలో రాసి చూపించాను వెంటనే వాడు చేరెడేసి కళ్ళు చేసుకుని, కాకి అని చదివి, క్రో అని నాకు ఇంగ్లీషులో అర్థం చెప్పాడు

అందుకే కాబోలు ముస్తఫా కెమాల్ పాషా టర్కీకి నియంత అయిన తక్షణమే కుడినుంచి ఎడమకు నడిచే కుదురైన తురక లిపిని రద్దువేసి రోమన్ లిపినే అందరూ విధిగా వాడాలని శాసించాడు మన దేశంలో కూడా అన్ని భాషలకీ రోమన్ లిపినే వాడితే ఈ వైజ్ఞానిక యుగంలో ఎంత సౌమ్మూ, శ్రమా కలిసొస్తాయో అని నే నెప్పుడూ అనుకుంటూ ఉంటాను.

మా తాతగాడి స్కూలులో ప్రతి నెలా పరీక్షలు జరుగుతూ ఉంటాయి అన్నింట్లోనూ మంచి మంచి మార్కులు తెచ్చుకుంటూ ఒక్క అరవంలో మాత్రం కోడిగుడ్లు పెడుతూ ఉంటాడు ఇవి నిజమై కోడిగుడ్లయితే ఎంత బాగుండును, ఆహార సమస్య కొంతవరకయినా తీరే కదా అనుకుంటాను అంతబాగా అరవ మాట్లాడగలిగేవాడికి అక్షరాల ఇబ్బంది వల్ల ఎప్పుడూ ఎర్రసిరాతో F (అని ఫెయిలయాడని) గుర్తు రావడం న కొంత ఆందోళన కలిగించింది వంతెన దాటలేని కారణంవల్ల ఇక పై క్లాసుకి వెళ్ళడం కష్టమే అ కున్నాను

పోనీ, యేదో ఆపద్ధర్మంగా ఆ హి లిపినే ప్రవేశపెట్టేస్తే బాగుండు సించింది నాకు హిందీ ప్రపంచ అని కీర్తించాడు మారిషస్ దీవ ప్రధాన మంత్రి మన దేశంలో మ త్ముని తర్వాత మహాత్ముడంతటివా వినోబాభావేగారు ఆసియా ఖం అంతటా నాగర లిపిని అమలుచే లనే కోరికను వెళ్ళబుచ్చారు కాని గొంతెమ్మ కోరికగా మాత్రమే పోతుందేమో అని నా భయం! ఆసి ఖండం మాటకేం గాని కనీసం దేశమంతటా భావేగారి కోరిక కాకపోయినా, కుప్పతెప్పలుగా కొక్కుల్లాగ బయలుదేరుతున్న గార్లో, అమ్మవార్లో తమ మంత్రాలవ తంత్రాల వల్లనో దేశమంతటా లిపిని తీసుకువస్తే మా తాత గట్టెక్కి ఉండేది

ఉండేదా? అదీ సందేహమే. వంలోని కొన్ని శబ్దాలను సూచిం అక్షరాలు హిందీలో లేవు మన

లుగు ధ్వనులైన ఎ, ఒ, చ, జ, అ
సు హిందీ లిపి న్యాయం చేకూర్చ
ను పంచ ద్రావిడ భాషల కుటుంబానికి
త్యేక లక్షణాలున్నాయి వీటిలో ఏ
క్కదానికీ నాగర లిపి అనుకూలం
దనే నా నిశ్చితాభిప్రాయం అనవస
ంగా మా తాతగాణ్ణి, వాడిలాంటి
సంఖ్యాకులైన విద్యార్థుల్ని పెనంలోంచి
ప్పులోకి తోసే సంస్కరణలు సుత
మూ నా కిష్టంలేదు

ఇంత కాలంగా అరవదేశంలో
టున్న నాకు పట్టుబడని అరవ భాషని
తాతగాడు అవలీలగా పట్టేశాడు
మ్మియడీ పెన్నె కుమ్మియడీ" అని
కు పాడుతూ ఉంటే విని తీరాల్సిందే
నేను పాడమన్నప్పుడు మాత్రం
బ పాడడు నేనడిగినప్పుడు పాడా
టే అందుకొక చాక్లెట్ మూల్యంగా
ంచవలసిందే

ఇదో కోలాటం పాట అని నాకు తెలి
సి ఇటీవల ఈ పల్లవిని ఉపయోగించి
వై సూత్రాల ప్రణాళికకు అను
లంగా ఎవరో కవి కొంత ప్రచార
గాత్యం సృష్టించాడు మొత్తం పాట
తాతగాడికి కూడా రాదుగాని

"అవసరకాలం వచ్చినప్పుడు
అవసర చట్టం అవసరం"

చరణం నాకు బాగా నచ్చింది
ంతే ఇందులో అరవ వారి అవసరం
తెలుగు వాడి అవసరం లేదు
'అవసర చట్టం తేవైయడీ" అని
ంలో ఉంది

నాగరలిపి కాని, రోమన్ లిపి కాని
ఇంతట్లోకి అమల్లోకి వచ్చే అవకాశాలు
లేవు కాబట్టి యెలాగైనా అరవ లిపినే
మాతాతగాడు జయించేటట్లు చెయ్యాలను
కున్నాను

మహాభారతంలో నేను చదివానో, లేక
చిన్నప్పుడు మా నాన్నగారు చెబితే
విన్నానో గాని అందులో అయిదుగురు
సింహబలులున్నారు భీముడు, జరా
సంధుడు, బకాసురుడు, కీచకుడు, దుశ్శా
సనుడు, వీరిలో ఏ ఒక్కడు ఇంకొక్కణ్ణి
చంపినా, ఆ చంపిన వాడి చేతిలో మిగతా
వాళ్లు చస్తారు ఈ రహస్యం ఒక్క
శ్రీకృష్ణపరమాత్మకే తెలుసు అందేత
చిన్న మాయోపాయంతో శ్రీ కృష్ణుడు
భీమునిచేత జరాసంధుణ్ణి చంపిస్తాడు
తరవాత కథ తెరమీద చూడ నక్కర
లేదు

ఈ కథతో ఉత్తేజం పొందిన నేను
పంచద్రావిడ భాషల్లో ఒకటైన తెలుగును
తీసుకుని తెలుగు లిపితో మా తాతగాడి
చేత కుస్తీ పట్టించాను ఏ మాయో
పాయాలూ ఉపయోగించవలసిన అవసరం
లేకుండానే మా తాతగాడికి తెలుగు లిపిమీద
మాస్టరీ సిద్ధించేటట్టు చూశాను

ఒక పిట్టకు రెండు దెబ్బలన్నట్టు,
కాదు ఒక దెబ్బకు రెండు పిట్టలన్నట్టు
మాతాతగాడికిప్పుడు తెలుగు, అరవం
అక్షరాలన్నీ కొట్టిన పిండి
అయిపోయాయి

ఫలితం? ఈ సారి టెస్టులో మాతాత
గాడికి అరవంలో కోడిగుడ్డుకు బదులు
వెరీ గుడ్డు అని ప్రశంస వచ్చింది ★

మీకు నచ్చేవీ

మీరు మెచ్చేవీ

ఎన్నో కథలు—

పండుగపై ప్రత్యేకంగా,
ప్రత్యేక సంచికకోసం ప్రత్యేకంగా
కార్టూనిస్టు లందజేస్తున్న
ఎన్నో కార్టూన్లు!
ప్రముఖ కార్టూనిస్టులు జయదేవ్, చంద్ర కలసి
తయారుచేసిన రెండు పేజీల కార్టూన్‌కథ కూడా!

## బాపు రంగుల ముఖచిత్రం

అంతేకాక

ఈ సంవత్సరం ప్రత్యేక సంచికలో
విలువైన ప్రత్యేక ఆకర్షణ కూడా!

---

పూర్తి వివరాలు వచ్చే సంచికలో చూడండి!

---

ఎదురు చూడండి!



## దీపావళి ప్రత్యేక సంచిక

## అక్టోబర్ **15** కే మీ ముందుకొస్తుంది!

సీరియల్

# సప్తస్వరం గాంధారం



ఆరెకపూడి (కోడూరి) కౌసల్యాదేవి

త్రై చెంపలపై అశ్రుధారలను సున్నితంగా ఒత్తుతూ అన్నాడు సత్యమూర్తి

"నాచేత అబద్ధం చెప్పించవద్దు సుందరీ, నిజం చెప్పి తేలిక కావడం ఎందుకు?"

"అంటే?" తన అశ్రువుల నొత్తుతూన్న అతడి చేతిని గట్టిగా రెండు చేతలతో బంధించి అడిగింది

జరిగిన కథ

శివరావు సౌమ్యుడు. పై మెరుగులకు కాక వ్యక్తిత్వాలకు విలువనిచ్చే వ్యక్తి ఆయన భార్య మీనాక్షి అందుకు పూర్తిగా వ్యతిరేకం వారికున్న ఇద్దరాడ పిల్లలలో పెద్దది ఉమ గుణాలకు తల్లి పోలిక తండ్రి గుణాలకు వారసురాలు సుందరి. ఆర్థిక చిక్కులలో ఉన్న గాయక కళాకారుడు సత్యమూర్తికి సాయం చేద్దామనుకున్న సుందరిని కసిరి కొట్టింది మీనాక్షి మీనాక్షి అభ్యంతరం పెట్టినా సత్యమూర్తికి తన పర్సనల్ అసిస్టెంట్‌గా ఉద్యోగం ఇచ్చాడు శివరావు. సత్యమూర్తి తల్లికి ఆపరేషన్ కోసం పెద్ద మొత్తం సాయం చేశాడు శివరావు సత్యమూర్తికి చక్కని బంగళా, ఫోను ఏర్పాటు చేశాడు మీనాక్షికి ఇదేమీ నచ్చడం లేదు శివరావుతో కలసి సత్యమూర్తి ఇంటికి వెళ్ళినప్పుడు, సత్యమూర్తి తల్లి చూపిన ఆదరభావమూ, ఆ తల్లీ కొడుకుల మధ్యగల అనుబంధమూ చూసి ముచ్చటపడింది సుందరి సుందరి ఒంటరిగా స్కూటరుపై వెళుతుండగా అల్లరి చేయబోయిన రౌడీలను దండించి ఆమెను కాపాడుతాడు సత్యమూర్తి సత్యమూర్తివైపు మరింత ఆకర్షితురాలవుతుంది సుందరి సత్యమూర్తితో షాపింగుకు వెళ్ళినందుకు సుందరిని నిలదీసింది తల్లి కుమార్ విదేశాలకు వెళ్ళాడు కుమార్ తిరిగి రాగానే ఉమకిచ్చి పెళ్ళి చేయాలని మీనాక్షి సంకల్పం అచేతనంగా ఉమ జీవితంలోకి శంకర్ ప్రవేశించాడు ఇద్దరూ బ్లూఫిలిమ్స్ చూశారు అంతే' ఉమ తనను తాను మరిచిపోయింది

అతడు బరువుగా నిశ్వసిస్తూ అన్నాడు బాధ ధ్వనింపజేస్తూ "ఆకాశంలోని చందమామను అంతటి మహానుభావుడు శ్రీరాముడే పొందలేకపోయాడు నేను సామాన్య మానవుడిని!"

సుందరి కనులలో కోటి ప్రభల తేజం!

"మీరు మీరు నన్ను ఇష్టపడ్తున్నారన్నమాటేగా?"

"ఇప్పుడేకాదు ప్రప్రథమంగా మిమ్మల్ని చూచిన క్షణం నుండీ మీ రెక్కడ? నే నెక్కడ?"

"ఫర్వాలేదు ఇది చంద్రుని వద్దకు మానవుడు జేరుతూన్న కాలం!" ధీమాగా అన్నది

"సుందరీ! మీకంటె నేను కనీసం నాలుగైదేళ్ళు పెద్దవాడినై వుంటాను."

"అయితే?"

"మీకంటె ఎక్కువ చదువుకున్నవాడినీ, లోకం చూచిన వాడినీ, నాపెద్దరికంపై గౌరవం వుంచి నామాట వినండి ఈ విషయం మన గుండెలలో గుప్తంగా పవిత్రంగా వుండిపోనీయండి, పదుగురిలో పరిహాసాల పాలు చేయవద్దు"

కొన్ని క్షణాలు మౌనంగావున్న సుందరి తలెత్తి స్థిరంగా అన్నది "మా డాడీ నా కోరికను కాదనరని నమ్మకం వున్నది నాకు!"

"సుందరీ!" అదరిపాటుగా అన్నాడు సత్యమూర్తి। "ఆయన దృష్టిలో నన్ను తేలిక చేయకండి దయ వుంచి మీ మనసు మార్చుకోండి" ఆమె చేతులలో వున్న తన చేతిని విడిపించుకుంటూ అభ్యర్ధనాపూర్వకంగా అన్నాడు "ఈ విషయం తెలుస్తే మి అమ్మగారు నన్ను జన్మజన్మలకూ క్షమించరు"

"మీకెందుకు? నాన్నగార్ని అంగీకరింపజేసుకొనే భారం నాది"

"మీకు నాన్నగారు నాకు యజమాని నన్నాయన దృష్టిలో హీనపరచవద్దు సుందరీ, ప్రేమకు పర్యవసానం పెళ్ళికాదు, ఈ ప్రేమ హృదయంలో వెన్నెల విరియజేస్తుంది, బలహీన క్షణాలలో బలాన్ని ప్రసాదిస్తుంది! దుఃఖసమయంలో ధైర్యాన్నిస్తుంది దైవాన్ని ఆరాధించడమే కానీ యింత వఱకూ ఎవరూ పొందలేదు, ఈ సువిపై. ప్రేమకూడా అంతే, అందుకే ప్రేమ దైవమేమో?"

రక్కున అన్నది సుందరి! "స్త్రీలకు దైవం భర్తరూపంలో లభిస్తాడట"

"సుందరీ" వారించుతూన్నట్లు అంటూ వెంటనే లేచి దూరంగా నిలబడ్డాడు. "నడవండి మనం హద్దుల్ను మించకూడదు అది మీకు మంచిది కాదు"

"సరే, హద్దులను మీరే అనుమతి వచ్చేవఱకూ మీరవద్దులెండి ఒక్క రిక్వెస్ట్."

"ఏమిటి?"

"కూర్చోండి చెప్తాను"

"ఊఁ చెప్పండి"

తన హాండ్‌బాగ్‌లో నుండి టేప్‌రికార్డర్ తీసింది సుందరి.

"ఏదీ—ఆ రోజు మా కళాశాలలో పాడారు రెండు ప్రణయ గీతాలు—అవి పాడండి, నేను రికార్డు చేసుకుంటాను"

సత్యమూర్తి ఆమె దెసచూస్తున్నాడు కానీ మాట్లాడలేదు

"రేపు మా తరగతివారమందరం పిక్నిక్ వెళ్తున్నాం, నాకు వెళ్ళాలని లేదు. కానీ తప్పదు పదిరోజులు—నాకు పది యుగాలుగానే వుంటుంది మీరు కన్పించక, కనీసం మీ పాటవింటూ గడుపుతాను, ప్లీజ్."




సానుభూతితో చూచాడు సత్యమూర్తి "ఇంతటి సామాన్యునిపై ఎంతటి ఆరాధన పెంచుకున్నావ్ సుందరీ!" అనుకోకుండానే అతడు ఏకవచన సంబోధన చేశాడు

గమనించిన సుందరి సంతోషంగా అన్నది "మీరెంత ప్రయత్నించినా మీ మనసులోగల ప్రేమనూ ఆరాధననూ కప్పిపుచ్చలేకుండా వున్నారు" ఆరాధనగా చూచిందతడి కనులలోనికి

పార్కులో అంతవఱకూ వున్న ఒక రిద్దరు వ్యక్తులు కూడా నిష్క్రమించారు సంధ్య చీకట్లు అలముకుంటున్నాయి ఇక ఈ సంభాషణను ఆపకపోతే ఇంకా మితి మీరగల ప్రమాదమున్నది.

"ఏపాట కావాలన్నారు?" మాట మార్చాడు టేప్ రికార్డర్‌ను అటూ యిటూ త్రిప్పి చూస్తూ

ఆమె అడిగిన రెండు గీతాలు పూర్తిచేసే సరికి పార్కులో లైట్లు వెలిగాయి. ఒక్కపిట్టకూడా లేదు

అయినా సుందరికి ఇంటిధ్యాస వున్నట్లులేదు యింకా

"నడవండి," సత్యమూర్తి ముందుదారి తీయడంతో విధిలేనట్లు అనుసరించింది.

"సుందరీ," విడిపోతూ ఆర్ద్రంగా సంబోధించాడు సత్యమూర్తి. "మీరు నా కొక్క వాగ్దానం చేయగలరా?"

రెండు క్షణాలు ఆలోచనా పూర్వకంగా చూపింది సుందరి "చేస్తాను మీ మీద నుండి మనస్సు మరల్చుకోమనే ఆదేశం మినహా, మీ మాట ఏదైనా వింటాను"

"అయితే వినండి, మనస్సులో ఒక కోరిక ఉద్భవించడం వేరు, అది పరి పక్వం జెంది నిశ్చయంగా మారడం వేరు అందుకు కొంతకాల పరిమితి అవసరం, మన విషయమూ అంతే మీరింకా చదువుకుంటున్నారు మీకంటె పెద్దవారైన ఉమా దేవిగారికి వివాహం జరగవలసి వున్నది ఆ తర్వాత గదా మీ విషయం? అంతవఱకూ వేచి వుండడం మీ కర్తవ్యం అప్పటికి కూడా ఈ బీదవాడిపై మీ ఆరాధన నిలిచి వుంటే అది నిజమైన ప్రేమ, అప్పుడు పెద్దలను అడగవలసి వుంటుంది"

"సరే, అయితే అంత వఱకూ నా కొఱకే వేచి వుంటానని మాట యిస్తారా మరి?

"ఓ!"

"ప్రామిస్?"

"యస్, ప్రామిస్!"

"రోజూ నిద్రించే ముందు మీ పాటలే వింటాను మరి మిరేం చేస్తారు?"

"నిద్రరాకుండా చేసే మీ చిలిపితనంతో ఊహల్లో ఆడుకుంటాను!"

## 16

భోజనానికి కూర్చున్న శివరావు చుట్టూ చూచాడు, టేబుల్ వద్ద తానొక్కడే!

సుందరి ఊళ్ళో లేదు. ఇంకా విహారయాత్రనుండి తిరిగి రాలేదు

ఇక మీనాక్షీ ఉమలు ఊళ్ళో వున్నా లేకున్నా ఒకటే' వారి రాకపోకలకు ఓ వేళాపాళా అంటూ వుండదు

సుందరికూడా లేక బొత్తిగా ఒంటరి తనం తోచిన శివరావు వంట మనిషిని అడిగాడు

"అమ్మగారు ఇంకా యింటికి రాలేదా?"

"లేదండి, ఈ రోజు ఆలస్యంగా వస్తానన్నారు "

"పెద్దమ్మాయిగారు"

"ఇంట్లోనే వున్నాదండి ఒంట్లో బాగుండలేదట అన్నం తినరట "

"ఏమిటి అనారోగ్యం? ఎప్పటి నుండీ?" ఒక్క ఉదుటున లేచి వెళ్ళాడు

"ఉమా! జ్వరం వచ్చిందామ్మా?"

తండ్రి మాటలకు కళ్ళు విప్పి చూచిన ఉమ గాభరాగా లేచింది

"ఒళ్ళు వేడిగా వున్నట్లు లేదే?" నుదుటిపై చేయివేసి చూచి అన్నాడు

"లేదు డాడీ, జ్వరం లేదు "

"మరి?"

"ఏమిటో అన్నం తినాలని లేదు ఒకటే వికారంగా చీకాకుగా వుంటోంది."

శివరావు కనుబొమలు ముడివడ్డాయి.

"మమ్మీకి చెప్పావా?"

"లేదు "

"వేళకు నిద్రా భోజనం లేకుండా, హోటల్ సరకులన్నీ తింటూంటే అలాగే పాడౌతుంది ఆరోగ్యం ఏ పార్టీలోనో ఏ కల్తీ సరుకునో తిని వుంటావ్ డాక్టర్ని పిలుస్తానుండు "

నవ్వింది ఉమ.

"ఈ మాత్రానికే ఇంగారెందుకు డాడీ? తగ్గకపోతే రేపు చూస్తాను డాక్టర్ని. ఈ



మందులు మ్రింగడమంటే నాకు తలనొప్పి"

"సరే ఆరోగ్యం విషయం అశ్రద్ధ చేయకూడదు" అని తాత్కాలికంగా అన్నాడేకానీ శివరావు మనసులో ఏదో చెప్పరాని గుబులు ప్రవేశించింది

'ఏమిటి ఈ ఇంటి భవితవ్యం? అవసరమైన అదుపాజ్ఞలలో ఆడపిల్లలు పెరగడం లేదు తల్లిగానీ, కుమార్తెగానీ ఎప్పుడు ఇంటికి వస్తారో — అసలు రారో — ఒకరి సంగతి ఒకరికి తెలియదు. ఎవరిష్టం వచ్చినట్లు వాళ్ళు రావడం, పోవడం. ఇంతటి ధనమూ, దర్జా గల ఇల్లు కేవలం నౌకర్ల చేతిలో నడుస్తుంటుంది

భోజనం చేయను మనస్కరించక ఓ గ్లాసు పాలు త్రాగి పడుకొన్న శివరావు మనసు మనసులో లేదు ఆలోచనలూ, అశాంతీ అతడిని నిద్రకు దూరం చేశాయి.

రోజూ భోజనానంతరం ఒక్కో నిద్ర మాత్ర శరణు పొంది శాంతి నందడం అతడికి అయిదారేళ్ళుగా అలవాటులో వున్నది

కానీ నేడతడు నిద్ర మాత్ర మింగలేదు భార్య రాక కొరకు ఎదురు చూస్తున్నాడు

అర్ధరాత్రి—

గోడనున్న విదేశీ గడియారం రెండు గంటలు మ్రోగించింది.

తర్వాత మరో అరగంట గడిచినట్లు సూచన చేసింది

కారు వచ్చిన శబ్దమైనది కాంపౌండ్ లో

హాలులో ప్రవేశించి, తలుపుతీసిన నౌకరును యధాలాపమైన రెండు ప్రశ్నలు వేసి సమాధానాలు పొంది, తన గదిలోనికి నిష్క్రమించింది మీనాక్షి

రాత్రి దుస్తులు ధరించి శయ్యను జేరబోతూన్న ఆమె భర్త ప్రవేశం చూచి కనులతోనే ఆశ్చర్యం ప్రకటించింది

"భోజనం చేయలేదా మీనా?"

ఏదో సాధించటానికో, వాగ్యుద్ధానికో తయారై వచ్చాడనుకున్న మీనాక్షి శివరావు సరళంగా అడిగిన తీరుకు తృప్తీ, ఆశ్చర్యమూ కూడ అనుభవించింది

"భోజనం చేసే వచ్చాను. కైలాసంవాళ్ళ చిత్రం ఒకటి బ్రహ్మాండంగా ఆడు

తోందట ఆ సంతోషాన్ని 'సెలిబ్రేట్' చేసుకున్నాం. వెరీ నైస్ లేడి. ఏ ఫంక్షన్ చేసుకున్నా నన్ను మరువదు."

వేదాంతిలా నవ్వాడు శివరావు "బాగుంది నౌకర్లున్నారు, వంటమనిషి వున్నాడు అన్ని రకాల పదార్థాలూ బల్లమీద చేర్చాడు కానీ ఈ రాత్రి ఈ ఇంటిలో అయినవాళ్ళెవరూ భోజనం చేయలేదు "

"ఏం? మీరూ ఉమా తినలేదూ? ఉమ ఇంటికి రాలేదా ఇంకా?"

ఆ అడిగిన తీరు ఏదో యధాలాపలాంఛనంగా వినవచ్చిందే కానీ యుక్త వయస్కురాలైన ఆడపిల్ల విషయంలో తల్లి ప్రదర్శించవలసిన ఆతృత ఎక్కడా విన రాలేదు

. శివరావు తన ధోరణిలోనే మాట్లాడుతున్నాడు "అన్ని ఇళ్ళల్లో అసలైనవారు తినగా మిగిలినవి నౌకర్లు తింటారట మన ప్రారబ్ధమేమిటో నౌకర్లు తినగా మిగిలినవి మనం తింటున్నాం "

"ఏమిటి మీ ఉద్దేశ్యం? నేను పార్టీ ఇచ్చినా వ్యాఖ్యానిస్తారు, మరొకరిచ్చిన పార్టీకి వెళ్ళినా సణుగుతారు; అసలు సంగతేమిటి?"

"ఇంట్లో భోజనం చేయనిదానవు వంట తక్కువ చేయమని చెప్పే బాధ్యత కూడా లేదా? ఇంటికైన ఇల్లాలివి నీవే అంత బాధ్యతారహితంగావుంటే ఇక పిల్లలకేం చేతనౌతుంది?"

"ఫర్వాలేదు ఒక్కపూట తిండికి కూడా లెక్క జూచుకొని కొలిచి కొలిచి వండాల్సిన దరిద్రపు కొంప కాదిది సవాళ్ళు మాని నన్ను పడుకోనీయండి" కంఠం తీవ్రంగా పలకడమే కాదు, మంచం విరిగేట్లు కూర్చున్నది అసహనంగా

ఎప్పటివలె శివరావూ తగ్గలేదు.

ఆ గది గుమ్మం తెర ప్రక్కకు లాగి, ఎదురుగావున్న డైనింగ్‌హాల్‌లోని ఫ్రిజిడైర్ తలుపు బార్లాగా తెరిచాడు శివరావు

అందు వంటకాలతో వున్న పాత్రలన్నీ ఒక్కొక్కటే కోపంగా క్రింద పడేశాడు

బిరియానీ, పప్పు, పులుసు, రెండు కూరలు—అన్నీ నేలపాలైనాయి

"మీరు విపరీతంగా త్రాగారా ఏం, ఈరోజు?" విస్మయంగా అడిగింది మీనాక్షి అతడు చేస్తున్న పనిని చూచి

"త్రాగలేదు కానీ నీ పార్టీల మైకం కంటే త్రాగుడు మైకమే నయం వంట వాడూ నౌఖర్లూ తినగా మిగిలినవి ఇందులో దాచారు "

"మిగిలినవి పాడవకుండా దాచుకోవటానికే ఫ్రిజ్!" దర్పంగా అన్నది మీనాక్షి.

"ఆ మిగిలినవే రేపు వెచ్చబెట్టి మరలా మన ముఖాన కొడ్తాడు ఆ మాత్రం వివరం చూచుకొనే విమర్శా, సమయము కూడా లేవు నీకు "



"ఏమిటి మీ ఉద్దేశ్యం?" ఛ్రురున లేచి నిలబడింది మీనాక్షి "నౌఖర్ల చేతిల ఇల్లు నడుస్తోంది వంటవా డలాచేశాడు, పనివా డిలా చేశాడు అంటూ నన్ను సతాయించటంలో మీ ఉద్దేశ్యమేమిటి? వంటవాడిని తీసేసి వంటింటిలో మసిగుడ్డలతో మ్రగ్గనా? పనివాళ్ళను తీసేసి చీపురుకట్టలతో తిరగనా? ఘూర్కాను తీసి పారవేసి ఇంటికి కుక్కలా కాపలాకాయనా?"

"ఇవన్నీ నువ్వు ఒక్కరోజైనా చేయగలవీ కావు, నేను జీవితంలో చేయిం గలవీ కాదు "

శివరావు అతి మందంగా అన్నా, మంచి వాడిగా వున్న ఆ మాటలు మీనాక్షి హేళనగా విన్పించి అవమానకరంగా భావించింది.

"ఇంత బ్రతుకూ బ్రతికి ఎంత ఇన్సల్ట్! మీ పాదాలు ఒత్తుతూ, మీ బూట్ల పాలిష్ చేస్తూ, మీరు ఏ టైముకు యింటికి తిరిగివచ్చినా తలుపుదగ్గర కుక్కలా ఎదు చూస్తూ పనికిమాలి పతివ్రతలాగా పడివుండదని డీయైజీ కూతుర్ని పెళ్ళాడిననా తెలియదనుకుంటాను పాపం!"

"డీయైజీ కుమార్తెవైనంత మాత్రాన నీ నెత్తిమీద కొమ్ములేమీ మొలవలేద మొలిచినా అవి నిన్ను ఈ సంఘం కోరలనుండి రక్షించలేవు కన్నతల్లిననే బాధ్య ఏ కోశమందైనా వుంటే ఓసారి ఉమ గదిలోకి వెళ్ళి చూడు. నీ డీయైజీ కూతు హోదా, నీ దర్పమూ కూడా రక్షించలేని హీనగతికి నీ గారాల కూతురు దిగజారకుం చూడు ఈ శివరావుకు డబ్బు కాదు, పరువూ, మానాభిమానాలూ ప్రధానమ తెల్సుకో!"

హుంకరించుతూన్నట్లే అని చకచకా వెళ్ళిపోతూన్న భర్తను అయోమయం చూస్తూ ఉమ గదిలోనికి దారి తీసింది

# 17

"హల్లో మీనాక్షిదేవీ! ఏమిటిలా వచ్చారు?" లేడీ డాక్టర్ కామేశ్వరి ఆదరం పలుకరించింది

"చిన్న పని వుంది లెండి ఖాళీగానే వున్నారా?"

ఎప్పుడూ చైతన్య స్రవంతిలా వుండే మీనాక్షిని గంభీరముద్రలో చూడడం
శ్చర్యమైంది కామేశ్వరికి.

"ఏమిటి సంగతి? మీకు సాధారణంగా మందుల అవసరమే వుండదే! మీ
ందం, ఆరోగ్యం చూచి డాక్టర్నైన నాకే అసూయగా వుంటుంది!" చమత్కారంగా
ిగిడింది

సాధారణంగా అలా పొగడ్తలు విన్పించేవారితోనే మీనాక్షి స్నేహం నిలుస్తుంది
ంరి!

"ఒక్కొక్కప్పుడు జరగనివి కూడా జరుగుతూంటాయిగా మరీ! నడవండి మీ
దిలోకి కొంచం ఉమని ప్రత్యేకంగా చూడాలి మీరు" మరోవేపు చూస్తూ మాట్లాడు
ిన్న మీనాక్షిని ఆశ్చర్యంగా చూచింది కామేశ్వరి అర్థమైనట్లు తల పంకించింది.
ిగ లక్షణాలు విని పరీక్ష ముగించిన కామేశ్వరి భయంగా చూచింది మీనాక్షి దెస

"ఏమిటి?" బింకంగా అడిగింది మీనాక్షి

"ఏం చెప్పను? ఏం చెప్పాలి?" సంశయిస్తూ ఉమనూ మీనాక్షినీ మార్చిమార్చి
ాడసాగింది

మీనాక్షి గంభీరత చెదరలేదు ఏమాత్రం ఆత్రం ప్రదర్శించలేదు డాక్టర్
ప్పేదానికి నిరీక్షిస్తూన్నట్లుగా వున్నది

ఉమను అక్కడే వుండమని మీనాక్షిని ప్రక్క గదిలోనికి తీసుకు వెళ్ళింది
ామేశ్వరి

"మీకేమీ తెలియదా?" కామేశ్వరి ప్రశ్న

"సూటిగా చెప్పండి కామేశ్వరీ" మీనాక్షి స్వరంలో అసహనమూ ఆజ్ఞాకూడా
న్నాయి

"ఉమకు నాల్గోనెల నిండుతున్నది"

భయపడ్తూ చెప్పిన కామేశ్వరి ఊహించినట్లుగా మీనాక్షి పెట్టిగంతులు వేయ
దు, పిడుగులూ ఉరుములూ అసలు వర్షింప జేయలేదు

నిదానంగా అన్నది, కూర్చున్న తీరులో చూస్తూన్న వైఖరిలో ఏ మాత్రమూ
ార్పూ అలజడి ప్రకటించకుండా—

"తర్వాతి విషయమేమిటో చెప్పండి"

తనకు గల ఇన్నేళ్ళ అనుభవంలో కామేశ్వరి యింత గుండె దిటవుగల స్త్రీని
ాడలేదు—ముఖ్యంగా ఇటువంటి సమస్యల విషయంలో

"ఈ రోజుల్లో ఇది చాలా తేలికగదా! క్లీన్ చేసేయండి ఎప్పుడు వీలు
డ్తుంది?"

"ప్లీజ్! ఒక్క పావుగంట కూర్చోండి. రక్తపరీక్ష చేసి చెప్తాను."

ఉమ కూడా బయటికి వచ్చి కూర్చున్నది తల్లివద్ద.




"నాకేం జబ్బు మమ్మీ?" అమాయకంగా అడిగింది.

కుమార్తెను ఒకసారి తేరిపార జూచింది మీనాక్షి "తెలివితక్కువ జబ్బు!" అన్నది నిర్లక్ష్యంగా

అర్థంకాని ఉమ అయోమయంగా చూస్తూండగా మరలా అన్నది మీనాక్షి "నా కూతురివై యుండీ యింత తెలివితక్కువగా ప్రవర్తిస్తావనుకోలేదు —" అన్నది కినుకగా

"ఏం చేశాను మమ్మీ?"

ఇంతవరకూ డాక్టర్ ఏవేవో ప్రశ్నలు వేయడమే కానీ, తల్లిగా మీనాక్షి కుమార్తెను ఒక్క ముక్క అడగలేదు - ఓ మాట అనలేదు

గతరాత్రి భర్త మందలింపును భరించలేక ఉమ గదిలోనికి వెళ్ళింది ఏవో యధాలాపంగా వేసిన ప్రశ్నలకు ఉమ నిద్రమత్తులోనే జవాబులు చెప్పింది

మరలా భర్త అడిగితే సమాధానం చెప్పవలసి వుంటుంది—ఎందుకైనా మంచిదని మొక్కుబడిగా డాక్టర్‌వద్దకు తీసుకువచ్చింది నేడు

డాక్టర్ చెప్పిన విషయం ఆమెను కృంగదీసి మనసును ముకుళింపజేసిన మాట నిజం అయితే, పరాయివాళ్ళ యెదుట తొణకటమా డీయైజీగారి యేకైక పుత్రిక మీనాక్షి!

"ఆ రోజు కుమార్‌తో కలసి ఎక్కడికి వెళ్ళావ్?"

ఈ ప్రశ్నతో పరిస్థితి కొంచం అర్ధమైనది ఉమకు ఒక్కసారిగా బెదరిపోయి అప్పటికప్పుడే లంఖణాలు చేసినట్లు పాలిపోయింది ముఖం

"మరి అతడితో నా పెళ్ళి జరుగుతుందనుకున్నాను"

అది తమ యిల్లు కాకపోయింది ఈడ్చి లెంపకాయ కొట్టడానికి

దహించి వేసేట్లే చూచింది మీనాక్షి కూతుర్ని.

అగ్నిలో ఆజ్యం గ్రుమ్మరించినట్లుగా కామేశ్వరి బెదురు చూపులు చూస్తూ వచ్చింది

"ఏమిటి?" మీనాక్షి అసహనంగా అడిగింది.

"సారీ ఈ పని జరగదు అమ్మాయి రక్తస్థితి అందుకు అనువుగా లేదు."

"అంటే?"

"రక్తంలో ఎర్రకణాలు తక్కువగా వున్నాయి ఇప్పుడు ఏమి చేసినా ప్రమాదమే రెండు—మూడు నెలలలో అయితే ప్రమాదించదు. నాల్గొ నిండుతున్నాయి మరి!"

మీనాక్షి కనుబొమలు ముడివేసింది "కామేశ్వరీ! నాటకం వద్దు నిజం చెప్పు. ఎంత డబ్బైనా ఇస్తాను పాపం—పుణ్యం అని భయపడే విషయం కాదిది ఇప్పుడు చట్టబద్ధమైనదని అందరికీ తెలుసు!"

"మీనాక్షిగారూ! నేను డబ్బు మనిషి ననేది నిజమే కానీ మీ వంటి స్నేహితుల విషయంలోనా? నేను చెప్పింది నిజమే అమ్మాయి ప్రాణానికే ముప్పు అది "

"మరి?"

"అతడెవరో—పెండ్లి చేసేయరాదూ?"

"సరే ఆలోచిస్తాను సెలవ్" అంటూ వెనక్కి వచ్చింది వెయ్యిరూపాయల కట్ట నిర్లక్ష్యంగాడాక్టర్ చేతిలో వుంచుతూ, "జాగ్రత్త రహస్యం పొక్కరాదు" అని చెప్పి వెళ్ళిపోయింది

"అయ్యో, ఇంత స్నేహంమీద — మీరు చెప్పాలటండీ?" అన్నదే కానీ డబ్బు తీక్షణంగా అక్కర్లేదని మాత్రం అనలేదు

'ఆఫ్టరాల్! ఈనాటికి ఒక మామూలు లేడీ డాక్టరును ఈ చిన్న కారణంగా అర్థించవలసి వచ్చింది' అనే న్యూనతాభావం మీనాక్షిని దొలిచివేస్తోంది అందుకే బింకంగా ఒక్క విసురు విసిరేసి మరీ వెళ్ళింది. ఆ విషయం తనకేమంత బాధాకరం కానట్లుగా .

"ఏవో జరుగుతూంటాయి వెధవ లోకం—అదను దొరికితే ఏడవటానికి సిద్ధంగా వుంటుంది అంతే కానీ నాకేం భయం లేదనుకోండి "

ఇల్లుజేరాక తనను ఎలా శిక్షిస్తుందోనని భయపడింది ఉమ

"ఛీ ఛీ, నా కూతురివై యుండీ ఇంత తెలివితక్కువ తనమా? మగవాడికి ఒక సారి లొంగిపోయాక ఇక నీపై మోజు ఏముంటుందే మతిమాలినదానా? పోనీ ఏదో జరిగిందే అనుకో — ఎన్ని మందులున్నాయి ఈ రోజుల్లో? ఇంత వాజమ్మలాగా పరువు పారేసుకుంటావనుకోలేదు "

"అవేమీ నువ్వు నాకు నేర్పలేదు మమ్మీ "

"చాల్లే, ఆపు" గద్దించింది "కుమార్‌ను రప్పించే ఏర్పాట్లు చేస్తాను మరి ఏదో సరదాగా తిరుగుతారు తర్వాత పెళ్ళి చేసుకుంటారులే అనుకున్నాను కానీ ఇంత బుద్ధితక్కువ పని చేస్తావనుకోలేదు "

గాభరాగా చూచింది ఉమ



"ఏం?"

"కుమార్ నా కిష్టంలేదు మమ్మీ" తల్లి నెమ్మదిగా మాట్లాడుతూండడంతో ఉమకు ధైర్యం వచ్చింది

"మరి? ఇష్టం లేకుంటే ఎందుకింత వరకూ వచ్చావ్?"

"తెలియలేదు "

"మరి ఏం చేద్దామంటావ్? అబార్షన్ వీలుపడదని డాక్టర్ అన్నది కదా?"

"శంకర్ " మాట పూర్తిచేయలేదు

"ఛీ, వాడా? ఏదో సరదాగా తిరిగితే ఫర్వాలేదు కానీ వాడితో పెళ్ళా?"

ఉమ మాట్లాడలేదు

మీనాక్షికి అనుమానం వచ్చింది "ఇంతకూ ఇందుకు కారకులెవరు?"

"తెలియదు!"

"ఏమిటీ???" పిచ్చిదానిలాగే అరచింది ఇంతవరకూ నిగ్రహించుకున్న కోపం ఇప్పుడు ఉప్పెనలాగా వచ్చింది.

"ఏమిటీ? ఇద్దరితోనూ ?" మాట పూర్తి చేయలేకపోయింది ఆవేశంలో "అంత ఒళ్ళు తెలియడంలేదా?" చెంప ఛెళ్ళుమన్పించుతూ అడిగింది "అసలా శంకర్‌గాడిమీద నీకా మోజు ఎలా కలిగింది? వాడికి మన ఆస్తిలో నగం కూడా లేదని నేను చెప్పడంలేదూ రోజూ?"

"అవన్నీ జ్ఞాపకం లేవు మమ్మీ" వెక్కిళ్ళతో పాటు ఒక్కో మాటే అన్నది

"ఏం, ఎందుకని?" మరో దెబ్బ పడింది

"కుమార్ ఫర్వాలేదు—ఒక్కసారికి ఏమీ జరగదన్నాడు "

"నాకెందుకు చెప్పలేదు?"

"తెలియలేదు చెప్పాలని "

"కానీ కుమార్ వెళ్ళిపోయి ఆరునెలలు కావస్తోంది కాదూ?"

" "

"మాట్లాడవేం?"

తాను తిరిగే తిరుగుళ్ళు యింత ఘోరంగా నేరస్థురాలినిగా నిలబెట్టగలవని
ఉమకు యీ క్షణంలోనే తెలిసింది. తల్లి ఉగ్రావతారం ఆమెను గడ గడ లాడించు
కొన్నది

"నాకు శంకరే కావాలి మమ్మీ" అన్నది డగ్గుత్తికతో

"ఎందుకని?"

" "

"చెప్పవ్‌గా? ఎందుకు? ఎప్పట్నుంచి ఈ మోజు వాడిమీద?" దవడ ఎముక
విరిగేటట్లే పడింది ఈసారి దెబ్బ

బెదరిపోయిన ఉమ మరి ఏ రహస్యమూ దాచలేకపోయింది

"మీరు చూచే సినిమాలు చూపించాడు శంకర్ ఒకనాడు "

"ఏమిటీ?"

"ఔను ఆ దీప్‌చంద్ బిల్డింగ్‌లో "

ఇక ఉమ వివరించలేదు, మీనాక్షి రెట్టించలేదు ఆమెకు అంతా అర్థమై
పోయింది

'రోజులు మారాయి కానీ వయసు తెచ్చే కోరికలూ, చపలతా మారవు' అని
భర్త చేసిన హెచ్చరిక నిజమైందా?

తాను ఏనాడూ సరకు జేయని భర్తముందూ, లెక్కజేయని లోకం ముందూ
నేడు తల ఒంచాలా?

'ఛట్! మీనాక్షి జాతకంతోనే లేదది' చురుకుగా ఆలోచించింది

'కానీయ్, శంకర్‌కేం? ఫర్వాలేదు ఆస్తి అంతగా లేదుమరి. పోనీలే అవ
రం మనది నాతో వియ్యం అంటే ఎగిరిపడి కళ్ళ కద్దుకుని మరీ చేసుకుంటారు
దాశివం దంపతులు ఈరోజే—ఇప్పుడే మాట్లాడ్తాను కుమార్‌కు తర్వాత సుందరిని
యవచ్చు '

'ఎవరిచేతనైనా మాట్లాడించటమా, నేనే చెప్పనా?' ఓ క్షణం ఆలోచించింది

'ఎందుకా డొంక తిరుగుడు? వారానికోసారైనా వాళ్ళు నా యింటికీ, మేము
వాళ్ళ యింటికీ వెళ్తూనే వుంటాంగా? ఇప్పుడే వెళ్తాను మాటలలో అన్నట్లుగా ఏదో
అనేస్తాను అంతే వాళ్ళు వెంటనే నా పాదాలు ఒత్తుతారు కాదు మరీ? మాతో
సంబంధం చేయడం వాళ్ళ కెంత గొప్ప?'

## 18

"రండి రండి " సాదరంగా ఆహ్వానించింది మిసెస్ సదాశివం.

మర్యాద కబుర్లూ, చల్లని పానీయ సేవనా ముగిసింది

ఏవో కబుర్లు సాగుతున్నాయి మీనాక్షి అవకాశం కోసం చూస్తోంది. చక్కటి
దం ఉపయోగించి తన అభిప్రాయాన్ని ప్రతిపాదించడానికి




'ఖర్మ! నా అంతదానను—నిన్ను అడగవలసి వచ్చింది' అని లోలోప తిట్టుకొంటోంది కూడా

అంతలో శంకర్ వచ్చాడు ఎవరో యువతిని వెంటబెట్టుకుని

"నమస్తే ఆంటీ" మ్రొక్కుబడిగా అనేసి, ఆ యువతి భుజంపై చేయివే నడిపించుతూ జంటగా మేడమీద తన గదిలోనికి వెళ్ళిపోయాడు

'ఒక యువతీ యువకుడూ స్నేహంగా వున్నంత మాత్రాన లక్ష అపార్థాలతో నానా చెత్తా వాగే అన్‌కల్చర్డ్ సొసైటీ మనది' అని భర్తతోనూ, స్నేహితురాం తోనూ అనేకసార్లు వాదించి వున్నానన్న సంగతికూడా మీనాక్షికి గుర్తు రాలేదు

శంకర్‌తో చెట్టాపట్టాలేసుకుపోతూన్న ఆ యువతిని అనుమానంగా చూచిం అసహ్యించుకుంటూ

"ఎవరాపిల్ల? మరీ మనం పెద్ద వాళ్ళం యిక్కడున్నామని కూడా లేకుండ అంత సిగ్గులేకుండా వున్నది?" అన్నది అక్కసుగా శంకర్ తల్లితో

"ఏం చెప్పను మిసెస్ శివరావ్, పెద్దవాళ్ళ లెఖ్ఖ ఎవరికున్నది ఈ రోజుల్లో వాళ్ళమటుకు వాళ్ళు చాలా కల్చర్డ్ అండ్ అడ్వాన్స్డ్ అనుకుంటున్నారు ఈ రోజుల్లో యువతీ యువకులు ఎవరో పంజాబీల అమ్మాయి అట!"

ప్రాణాలు ఉగ్గబెట్టి అడిగింది మీనాక్షి! "స్నేహితురాలా? మరీ అతడి పడగ్గ లోకి వెళ్ళిపోయిందే?"

"స్నేహమే అయితే అనుకొనేదేముంది మిసెస్ శివరావ్? వారంరోజుల క్రిత రిజిష్టర్డ్ మ్యారేజ్ చేసేసుకున్నారు అటంక పెడ్తామని మాకు ఏమీ తెలియనీయ లేద 'అమ్మా ఇదుగో నీ కోడలు!' అన్నాడు అంతే!"

మీనాక్షి ముఖంలో ఎన్నడూ కన్పించని ఉద్వేగం గమనించిన ఆమె మఱ అన్నది!

"ఏమిటి మిసెస్ శివరావ్? ఒక్కసారిగా అలా అయిపోయారేమిటి? ఒంట్ల బాగున్నదా?"

"ఆఁ నాకేం కానీ కోడలని తీసుకురాగానే మీరు యింట్లోకెలా రానిచ్చార

తన్ని తరిమేయాల్సింది!" అక్కసుగా అన్నది

"ఏం లాభం దానివెంటే కొడుకు పోతాడుగదా! బొత్తిగా అదెలాగ? అయినా మన వాడిని మనం ఎందుకు చెడగొట్టుకోవాలి? మనదేం పోయింది? నేను మగ బిడ్డ తల్లిని మగవాడెలా వున్నా ఫర్వాలేదు. ఆడదాన్ని తల్లి జాగ్రత్త పెట్టుకోవాలి"

చెప్పుదెబ్బ కొట్టినట్లు కాదు —

చెప్పుల మాలను కంఠహారంగా ధరించినట్లే అనుభూతి కలిగింది మీనాక్షికి

"సరే—మరి నేను వెళ్తాను." అంటూ చివ్వున లేచి రివ్వున వెళ్ళిపోయింది

తన కొడుకు పెళ్ళి విషయంలో మధ్యన మీనాక్షికి అసంతృప్తి ఎందుకో మిసెస్ సదాశివంకు అర్థం కాలేదు విస్తుపోయి చూస్తూండిపోయింది

ఇంటికి తిరిగి వచ్చిన మీనాక్షికి మతిపోతున్నట్లే వున్నది

"ఏం చెయ్యాలి? ఏం చేయను? ఎవర్ని సలహా అడగను? ఛ ఇది ఎవరినీ సంప్రదించగల విషయం కాదు ఛీఛీ, ఎవళ్ళని దేవిరించను యింత బ్రతుకూ బ్రతికి?"

ఫోన్ మ్రోగుతోంది

"చూడు ఎవరో?" విసుగ్గా ఆదేశించింది నౌఖరును, ఆమెకు ఎవరితోనూ మాట్లాడాలని లేదు

"అయ్యగారు మీతో మాట్లాడాలట!"

పిడుగు పడ్డట్లే వినిపించింది

ఎందుకో ఈ వేళ కాని వేళ! ఏం మాట్లాడతారు?

భర్తను ఏనాడూ లక్ష్యపెట్టని మీనాక్షికి నేడు భర్త యెడల భయం వంటి భావం ఏదో లోలోన అంకురించింది!

"హల్లో ఏమిటి?" అన్నది నీరసంగా

"ఆఁ, ఏం చేస్తున్నావ్?"

"ఏమీ లేదే?"

"అన్నట్టు ఉమ ఎలా వుంది? ఈ రోజు భోజనం చేసిందా?"

"ఆఁ ఆఁ బాగానే బాగానేవుంది" తడబడిపోయింది మీనాక్షి.

"ఏమిటలా ఖంగారుపడ్తున్నావ్?"

"నేనా? లేదే? ఎందుకూ ఖంగారు?"

"ఉమను డాక్టర్‌కు చూపావా? ఏమిటి కంప్లయింట్?"

" "

"హల్లో. వినలేదా నామాట?"

"ఆఁఆఁ విన్నాను. ఇంకా వెళ్ళలేదు డాక్టర్ దగ్గరకు."

"ఏం, ఏం చేస్తున్నావ్?"




"ఆఁ ఎవళ్ళో వచ్చి కదలక కూర్చున్నారు ఇప్పుడే పోయారు " అప్రయత్నంగా అబద్ధం చెప్పివేసింది

"ఆ వ్యాపకాలన్నీ రోజూ వుండేవే కానీ, పిల్లల ఆరోగ్యం ముఖ్యం పోనీ నీకు తీసుకెళ్ళే ఓపిక లేకుంటే పరబ్రహ్మాన్ని యింటిని రమ్మనలేక పోయావా?"

గుండె ఆగిన మీనాక్షి మాటలుడిగి, చేష్టలు దక్కి నిలబడింది

"ఇప్పుడే ఫోన్ చేస్తాను నేను వచ్చి చూస్తాడు ఉమకు చెప్పు ఎక్కడికీవెళ్ళి పోవద్దని, నువ్వూ కాస్త యింట్లోనే వుండు "

"అలాగే," అనక మరే మంటుంది?

బొత్తిగా యిటువంటి ఉన్మాద స్థితి వంటి పరిస్థితి మునుపెన్నడూ ఎదురు కాలేదు మీనాక్షికి

ఇంత వంటరితనంతో బాధపడినదికూడా లేదు ఇదివరలో

సరే డాక్టర్ పరబ్రహ్మం మినహా యింకెవరున్నారు కన్సల్ట్ చేయడానికి మాత్రం? డబ్బుకోసం నానాగడ్డీ తినేరకం కామేశ్వరి నేను యింత దర్జాగా సామంతంగా వుంటానని అందరికీ అసూయకూడా అందుకే యిలా చెప్పివుంటుంది

కామేశ్వరిపై అనుమానం తీరాలంటే మరో డాక్టర్ని కన్సల్ట్ చేయక తప్పదు మరి నమ్మదగ్గ వ్యక్తి పరబ్రహ్మం కాక మరొకరు లేరు తమ కుటుంబానికి

నమ్మశక్యంగాని ఘోరం జరిగిపోయినట్లుగా చూడసాగాడు పరబ్రహ్మం మీనాక్షి మాటవిని ఉమను అతడూ పరీక్షించాడు. కామేశ్వరి మాటలు నిజమేనని నిర్ధారించడమే కాదు—కుటుంబ స్నేహితునిగా తనకు గల చనవుతో గడ్డి పెట్టినంత పని చేశాడు మీనాక్షికి

"ఇదెలా జరిగిందసలు? శివరావు భరించలేడు ఈ వార్త. మన కుటుంబాలలో జరగవలసినవి కాదు యిలాంటి నీచపు పనులు."

తన పోగరునూ, వార్ధాటినీ, చాలా ఓరిమిగా పట్టి బంధించింది మీనాక్షి.

"ఏదో జరిగిపోయింది ఇక కానున్నది ఆలోచించండి పరబ్రహ్మంగారూ. ఆయనకు తెలియనీయకుండా మీరేమీ చేయలేరూ?"

పరబ్రహ్మం అసహ్యంగా చూచాడు

"ఈ రోజుల్లో ఇది చాలా తేలిక అనీ, చట్టంకూడా అంగీకరిస్తూన్నదనీ "

"ఔను అందుకే అందరూ కళ్ళు మూసుకు ప్రవర్తిస్తున్నారు కానీ మానవుడి మేధ జయించలేని విషయాలు యింకా చాలావున్నాయి ఎన్ని సాధించినా ఎక్కడో ఒకచోట మనిషి బోర్లా పడవేసి తన ఆధిక్యతను నిరూపించుకుంటుంది విధి "

"ఏమీ మార్గం లేదంటారా?"

"లేదు అది ఉమ ప్రాణానికే ముప్పు మీరా ఆలోచన మానుకోండి "

"ఏది దారి?

"మీనాక్షిగారూ మీరు ఈ పద్ధతిలో ఎందుకాలోచిస్తున్నారసలు? పోనీ ఏదో జరిగిందే అనుకుందాం. ఆ పెళ్ళి కాస్త కానిచ్చేయరాదూ?"

"వీలు పడదండీ ఆ పిల్లవాడు—కుమార్ ఇటీవలనే ఫారిన్ వెళ్ళాడు. వచ్చాక వివాహమని మేమనుకున్నాం "

"ఎంత పని చేశావమ్మా ఉమా!" మరి మాట్లాడలేనట్లుగా తల వాల్చుకున్నాడు.

"నేనేదో ఆలోచిస్తాలెండి ఆయనకు తెలియనీయవద్దు " హెచ్చరించుతూ సాగనంపింది అతడిని

ఆడవాళ్ళు తొందర స్వభావులు, డబ్బుకు కక్కుర్తిపడే ఎవతె చేతులోనో ఉమను ఏదో చేయించేస్తుందేమో మీనాక్షి? ఇద్దరి కూతుళ్ళూ రెండు కళ్ళుగా భావించే శివరావు అది తట్టుకోలేడు

"హల్లో పరబ్రహ్మం, ఏమిటింత సావకాశం దొరికింది నీకు ఇవాళ? అన్నట్టు ఉమను చూశావా? వెళ్ళావా మా యింటికి?"

"ఊ" మూలిగినట్టు అని తల వాల్చుకు కూర్చున్న పరబ్రహ్మాన్ని గాభరాగా చూశాడు శివరావు

"ఏమిటి? ఏమిటో చెప్పు. ప్లీజ్ "

"ఎంత త్వరగా వీలైతే అంత త్వరగా — రేపే అయినా సరే ఉమకు పెళ్ళి చేసేయాలి!"

"ఆ???"

" "

"ఉమ "

"గర్భిణి!!!

[సశేషం]

# తెలుగువాళ్ళం

శ్రీలవాటు ప్రకారంగా ఆరోజు సాయంత్రం పంజాబీ హోటల్లో నేను నా మిత్రుడు స్పెషల్ టీ త్రాగుతున్నాం ఓ వ్యక్తి కెదురుగా వచ్చి కూర్చున్నాడు

"నాకు ఒక మంచి టీ తీసుకురండి " అన్నాడు సర్వర్‌తో

అతను తెలుగు మాట్లాడే తీరు వింతగా వుండటం వల్ల నాకు నవ్వొచ్చింది

అతను తన చేతివాచీని చెవిదగ్గ రుంచుకుని నావేపు చూస్తూ అడిగేడు "ఏమండీ! మీ గడియారంలో ఎన్ని గంటలు అయినవి?"

వెంటనే బాచి నవ్వుతూ చెప్పేడు "సిక్స్ ఫిఫ్టీన్ సార్!"

"నా పేరు జేమ్స్! నాది అమెరికా దేశం! ఇక్కడ యూనివర్సిటిలో తెలుగు డిప్లొమా చదువుకుంటున్నాను " ఎంతో కష్టంమీద తెలుగులోనే తనను తాను పరిచయం చేసుకున్నాడు జేమ్స్ తర్వాత మా వివరాలు కూడా అడిగి తెల్సుకున్నాడు

"ఈమధ్య వివేకానంద హాలులో బిస్మిల్లాగారి షెహనాయి విన్నాను చాలా చాలా బాగుంది." జేమ్స్

"అవునండి ఆ ప్రోగ్రామ్‌కి నేను కూడా అటెండయాను రియల్లీ వెరీ గుడ్!" నేను

"సుబ్బలక్ష్మిగారి పాటలు కూడా విన్నాను ఎంతో బాగున్నాయి "

"యస్! షి ఈజ్ ఎ గుడ్ సింగర్!" బాచి

"ఆవిడ పాడిన సుప్రభాతం మీరు విన్నారా?" నేను

"రేడియోలో శనివారం వస్తుంది అదేకదండీ?"

"దట్ వన్ ఓన్లీ!" బాచి

"ఎంతో బాగుంటుందండి "

"మీరు తెలుగు సినిమా లేమైనా చూశారా?" నేను

"ఓ! మిస్సమ్మ సినిమా చూశాను చాలా హాస్యముగా వున్నది అందులో 'బాబూ! గ్రుడ్డివాడిని బాబూ! ధర్మం చేయండి!—' అన్న అతని నటన చాలా చాలా బాగుందండి మంచి హాస్యగాడు "

"దట్ మేన్ రేలంగి! రియల్లీ ఎ వెరీ గుడ్ కమేడియన్!" బాచి

"అవునండి " జేమ్స్

"మిస్టర్, జేమ్స్! హౌ ఆర్ యూ ఫీలింగ్ దిస్ వైజాగ్?" బాచి

"చాలా చాలా బాగుందండి ఈ సాయంత్రము నాకు బాగా గడచినది నేను యూనివర్సిటీ హాస్టలుకి వెళ్ళిపోవాలి సెలవు తీసుకుంటాను. నమస్కారమండి వస్తాను " అంటూ లేచాడు జేమ్స్

"సీయూ" బాచి

—సుస్మితా రమణమూర్తి

# జనవరి - డిశంబర్

చెల్లూరి సీతారాజేశ్వరరావు

*

## కాదంబరి

నా భోజనమయ్యే సరికి రెండయింది వసారాలో ఎండ వాలుగా పడుతోంది వడియాల పళ్ళెం ఎండలోకి జరిపి వంటింటిలోకి వస్తూంటే వీధి తలుపు చప్పుడయింది కుమారి ఏ పుస్తకానికయినా వచ్చిందేమోనని 'వచ్చే' అన్నా తీరా తలుపు తీసేసరికి అపరిచిత వ్యక్తి. యాభై వుంటాయి పొడవుగా గడ్డం పెరిగినట్లుంది. ముఖం గుర్తు పట్టడం అసాధ్యమే అయింది బట్టలు కూడ చాల మాసివున్నాయి

"ఎవరు కావాలి?"

అతడు పిచ్చిగా చూశాడు కుడిచేత్తో ముఖం రుద్దుకుని నిట్టూర్చాడు నాకు భయంవేసింది రెండడుగులు వెనక్కివేసి తలుపు బలంగా పట్టుకున్నాను అతడిలో ఏ కదలిక లేకపోయేసరికి "మాట్లాడవేం? మూగివా?'' గద్దించాను

''అవును కాదంబరీ మీరు వేసే ముష్టికి "

విసుగుపడ్డాను కంఠస్వరం పరిచితమే ''మీరు ''

"నీ భర్తనని చెబితే సిగ్గు పడతావు"

సందేహంలేదు ఆయనే వెనక్కి తిరిగి లోపలికి నడిచాను మనస్సంతా తిమ్మిరి ఎక్కిపోయింది గుండెదడగా వుంది ఈ విచిత్ర పరిస్థితేమిటి భగవాన్

"కాసిని మంచి నీళ్ళిస్తావా కాదంబ" వరండాలో కుర్చీలో కూర్చుని లోపలకి తొంగిచూస్తూ కేకేశారు ఒకనాడు ఆయన యింటికి వస్తారని, నన్నూ పిల్లల్ని ఆదరిస్తారని ఎంతగానో ఎదురు చూశాను. అది నీటిమీద రాతని తెల్సిపోయింది. అయినా మనసు అసంభవాన్ని వూహించుకునేది

ఈ నాడు అప్రయత్నంగా వచ్చినా స్వాగతం చెప్పలేక పోతున్నాను

మంచినీళ్ళిచ్చి తలుపు చాటుకి తప్పుకున్నాను

"నన్ను మన్నించ లేవు కాదంబరీ నాకు తెల్సు. ,మీ జీవితాలతో జూదం ఆడుకున్నాను అన్ని విధాల మిమ్మల్ని నాశనం చేశాను అందుకు తగిన శిక్ష భగవంతుడు విధించాడు " ఆయన కంట తడిపెట్టారు

ఇకనా పట్టుదల పనిచేయలేదు ఆయన ఏడ్వడంతో మనస్సు వికలమై పోయింది "జరిగినదంతా ఇప్పుడెందుకు లెండి "

తడి కళ్ళతో నా రెండుచేతులు పట్టుకున్నారు ''నువ్వు క్షమిస్తేగాని శాంతి లేదు కాదంబరి ప్రాణం పోయేలోగా కళ్ళతోనైనా మిమ్మల్ని చూసి వెళదామని వచ్చాను "

"ఏమిటండీ ఆ మాటలు" నొచ్చు

కున్నాను.

"ఇంకా నేను బ్రతికేం చెయ్యాలి కాదంబరీ మీకు భారంగా వుండాలి. పిల్లలు ఎలా వున్నారు? పైకి వచ్చారా?"

తన యింటిగురించి తనకే ప్రశ్నలు।

యిల్లు గురించి అపరిచితంగా ఖూట్లాడే దశలో వున్నారు దీనికికారణం ఆయనే మేమంతా ఒక రోజున సంకెళ్ళగా కనిపించాం విముక్తి దొరికితే చాలని భవబంధాలు త్రెంచుకో గలిగారు

ఎంత చీకట్ని చూశాను దానితో సంసారం తెరచాపలేని నావయింది సూరీడు లేని ఆకాశమయింది పిల్లలిద్దరూ చిన్నవాళ్ళు చుట్టాలు ముఖం తప్పించారు నాకు సాయం చెయ్యాలేమోనని ఎన్ని బాధలుపడ్డా పిల్లలు ఎదిగి వచ్చారు కనుక ఆ చీకటి కనిపించడం లేదు

"కాఫీ పెడతా।'' లోపలికి నడిచాను ఇన్నాళ్ళ తర్వాత కల్సుకుంటే మాటలకేం కొదువ కొత్త పరిస్థితిని తట్టుకోడానికి విరామం ఇచ్చాను

''భోజనమే చేస్తా నుంటే "

ఆకలితో మనిషిని కూర్చో పెట్టినందుకు బాధపడి "క్షణంతో వడ్డించేస్తా స్నానంచేపిరండి" బాత్ రూంకి దారిచూపించాను

ఆయన వచ్చేలోగా గాస్ మీద అన్నం వుడికింది కొద్దిగా కూర, పులుసు వున్నాయి చాలా కాలం తర్వాత ఆయనకి వడ్డించడం అనుభూతిగా వుంది తెరలు తెరలుగా గతం గుర్తుకు వస్తోంది కన్నీళ్ళు ఉప్పొంగుతున్నాయి

ఆయన భోజనమయింది హాల్లో మడత మంచం వేశాను. ఆయన సిగరెట్ వెలిగించి "పిల్లలు రాగానే చెప్పు కాదంబరీ" మంచం మీద వాలారు

పని ఎంతో వుంది ఏం చెయ్యాలని లేదు అంతా శూన్యంగా వుంది, పెరట్లో వేపచెట్టు నీడలో హృదయ భారం దింపుకోడానికి వెక్కి వెక్కి ఏడ్చాను

ఆయన రావడం సంతోషంగా వుంది. విచారంగా వుంది భార్యని కనుక ఆయన్ని ఎలా గయినా క్షమిస్తాను పిల్లలు?

కుమారి—కిరణ్ తండ్రికి స్వాగతం



యిస్తారు? వాడసలే ఆవేశం మనిషి పేరు చెబితేనే మండి పడేవాడు

ఇప్పుడు ఘర్షణే జరుగుతుంది. తప్పదు

## కాశీపతి

పడుకున్నానుగాని నిద్ర పట్టలేదు కొత్త వాతావరణంలో బెరుగ్గా వుంది నా కుటుంబం ముందు దోషిగా నిలబడి నందుకు చాలా బాధగా వుంది కాని చరిత్రని చెరిపివేయడం ఎలా?చేదు మాత్రలా మ్రింగవల్సిందే

లేచి సిగరెట్ వెలిగించాను బయట ఎండగా వుంది కొబ్బరి చెట్టుక్రింద సోడాల కుర్రాడు కునికిపాట్లు పడుతున్నాడు ఎక్కడి నుంచో రికార్డులు వినిపిస్తున్నాయి

గోడమీద ఫొటో నన్ను ఆకర్షించింది లేచి అందుకున్నాను కాదంబరి ప్రక్కగా కొడుకూ, కూతురూ, ఇద్దరూ తల్లిపోలికే! ముచ్చటగా వున్నారు నేను బాధ్యత వది లేపి నా కాదంబరి వార్ని ప్రయోజకుల్ని చేసింది ఇది నాకు చాల సంతోషంగా వుంది

నిశ్శబ్దంలో కూర్చోవడం చాల బాధగా వుంది కాదంబరి లోపల పనిలో వుంది పిలుద్దామా అనుకున్నాను కాని బెరుకు సంశయం

చెప్పు లేసుకుని బయటకు నడిచాను సందు చివర కిళ్ళీ బడ్డీ దగ్గర సిగిరెట్లు తీసుకుని ఎటు పోవాలా అని ఆలోచిస్తున్నాను వూరు చాలా మారిపోయింది

బొట్ గేటు వేసివుంది రెండు ప్రక్కలా వాహనాలు. జనం క్యూ, రైలు వస్తోంది క్షాత్రోలు రాబోయే బండి కోసం నిరీక్షణ!

ఆ నిరీక్షణలోనే నేను

సమస్యలతో, చిరాకులతో కాదంబరి నలిగి పోయింది వృద్ధాప్యచిహ్నాలు తొంగిచూస్తున్నాయి నేను వూహించినట్లు ఆమె పులిలామీద పడలేదు నన్ను చూసి వ్యాకులతతో నిట్టూర్పు విడిచిందంతే

ఆ నిట్టూర్పులోనే ఇన్నాళ్ళ వ్యథా, కథా దాగుంది

కాదంబరిని చేసుకున్నందుకు ఒక నాడు పొంగిపోయాను నా అదృష్టంగా భావించాను ఈ పెళ్ళివల్లే నా దత్తత తండ్రికి నా మీద కోపం వచ్చింది

"ఆస్థిలో పైస ఇవ్వను పో "

అన్నాడు తను చూసిన పది ఎకరాల కట్నం అమ్మాయిని చేసుకోనందుకు

నేను లెక్కచేయలేదు ఉద్యోగ ముంది నా కాళ్ళమీద నేను నిలబడ గలను కాదంబరితో బొమ్మరిల్లు నిర్మించుకున్నాను

ముసలాయన కోపం తాటాకు మంట లాడింది చివరి రోజుల్లో నా కోసం కలవరించి పోయాడు

ఆయన పోగానే ఆస్థే వచ్చింది అది తెచ్చే తళుకూ బెళుకూ వచ్చాయి. ఉద్యోగం బానిసత్వం క్రింద కనిపించింది నిన్నటి విలువలు మారిపోతున్నాయి జీవితంలో సందడి హెచ్చింది విరామం తగ్గింది రూపాయలు చేసే సర్కస్‌కి రింగ్ మాస్టర్ని అయ్యాను

ఉద్యోగానికి రాజీనామా యిచ్చాను.




---

కాని కాలం గడవడానికి వ్యాపకముండాలి, మిత్రుల సలహా మీద మద్రాసు చేరుకున్నాను కళా జీవితం కేపి కాళ్ళు నడిచినాయి బడ్జట్‌గా జానపదం తీశాను బాక్సాఫీసు హిట్టయింది వరుసగా తమిళం, తెలుగు, హిందీల్లో బొమ్మలు తీశాను

"నేను పిల్లలు యిక్కడెందుకు? మమ్మల్ని కూడ అక్కడికి తీసుకుపొండి" ఓసారి యింటికి వచ్చినపుడు కాదంబరి అంది

"చూద్దాంలే!"

ఆ రంగుల ప్రపంచంలో కిరణ్మయి నన్ను ఆకర్షించింది నేను ఆమె బందీనయ్యాను ఆమె చెప్పినట్లు చెయ్యడం గొప్పగా వుండేది

"మీ రిక్కడే వుండిపొండి"

"అవును బావగారూ" గంగరాజు వంత పాడేడు

రోజులు పరుగులు తీస్తున్నాయి కాదంబరికి నెలనెల డబ్బు పంపిస్తున్నాను ఓసారి ఔట్‌డోర్ కెళ్ళినప్పుడు కాదంబరి కనిపించింది

మాట్లాడదామంటే దగ్గరే కిరణ్మయి వుంది ఆమెకి కోపం తెప్పించే స్థితిలో లేను చీటీ పంపించాను "రాత్రికి వస్తున్నాను"

షూటింగ్ పూర్తిగానే స్నానంచేసి 'లొకేషన్ సెర్చి' పేరు మీద ఒంటరిగా వెళ్ళాను ఎనిమిదయింది కాదంబరి నా కోసం ఎదురు చూస్తున్నది-పిల్లలు నిద్ర పోతున్నారు

భోజనం వడ్డించింది తినేదాకా వదల్లేదు

"నేనేం పాపం చేశాను చెప్పండి"

ఘొల్లుమంది నా వళ్ళో వాలిపోయి
"డబ్బు పంపిస్తున్నాగా "
"అంతేనా మీ బాధ్యత "
అక్కడ వుండటం ముళ్ల మీదవున్నట్లయింది కాదంబరి ఏడుపులో చిరాకు వచ్చి "అందుకే నాకు రావడానికి చిరాకు" లేచి వచ్చేశాను
ఎన్నడూ మరిపోలేదు సిన్మా ప్రపంచంలో కాదంబరి గుర్తు లేకుండా పోయింది మొదట్లో వుత్తరాలు వచ్చేవి ఆమె దగ్గర్నుంచి రాను రాను తగ్గిపోయినాయి
వదిలింది పీడ—సంతోషించాను
కిరణ్మయి కిరణాల మత్తులో పడిపోయాను నా ఆస్థికి, చివరికి నేనే ఆమె చేతిలో బొమ్మనయ్యాను కిరణ్మయి నా జీవితానికి పెన్నిధయింది
పొగమంచులా క్రమంగా ఆమె ప్రేమ తగ్గ సాగింది తగ్గింది పాలు విరిగినయ్, మొదలియార్‌తో ఇంట్లో పబ్లిక్‌గా తిరగడం చూసి మండిపడ్డాను
"నువ్వు నా మొగుడివా!"
నిలవేసి అడిగింది
ఇంతకీ నే నెవర్నో చెబుదామంటే సమయం మించిపోయింది యావదాస్తి ఆమె పేర్న వుంది నా స్థితి అర్థమయింది
అనామకుడ్నయ్యాను

## కుమారి

లాస్ట్ అవర్ లీజరు అంచేత రోజూ కంటె పెందరాళే యింటికి వచ్చాను బట్టలు మార్చుకుని కాఫీత్రాగి పేపరు తిప్పుతూ వరండాలో కూర్చున్నాను.

కుర్చీలో సంచీ మంచం దగ్గర సిగరట్ల పీకలు, కొత్తగా ఎవరొచ్చారబ్బా. అన్నయ్య సిగరెట్లు కాల్చడు. ఎవరో వచ్చి వుండాలి ఏం బంధువయినా
"ఎవరిదమ్మా సంచీ!" అమ్మని కేకవేశాను
అమ్మ సమాధానం చెప్పలేదు
సంచీలో రెండు జతల బట్టలు, వారపత్రికా, కళ్ళజోడు వున్నాయి వంటింటిలోకి వెళ్ళాను అమ్మ టిఫిన్ చేస్తున్నది
"ఎవరొచ్చారమ్మా మనింటికి?"
సందేహంగా చూసింది అమ్మ ఆమె హావభావాలు కొత్తగా వున్నాయి శ్రావణ మేఘంలా వుంది ఆమె ముఖం నేను కలవర పడ్డాను
"మీ నాన్నగారు వస్తే" నేను అడిగే లోపుల అన్నది
షాక్ తగిలింది కొత్త వ్యక్తి మమ్మల్ని అగాధంలోకి త్రోసిన వ్యక్తి ఈనాటికి మళ్ళీ జ్ఞాపకం వచ్చామన్నమాట
"పొమ్మని చెప్పలేక పోయావా? ఎందుకు రానిచ్చావ్?"
"కుమారీ!" నా ఆవేశానికి అమ్మ విత్తాకు పడింది
"నాన్న నాన్న మనల్ని నాశనం చేసి తిరిగి చూడడానికి వచ్చాడన్న మాట. ఎంత ప్రేమ రాసీ చెబుత!"
అమ్మ నా చేతులు పట్టుకుంది "ఆయన తప్పు చేస్తే మనమూ చెయ్యాలా తల్లీ రాక రాక యింటికి వచ్చారు ఆయన్ని నొప్పించడం భావ్యమా?''
అమ్మ రాజీపడే మనిషి వెనుకటితరం

పురాణ హాస్యవృక్షం!




మన స్త్రత్వం ఆమెది భర్త ఏం చేసినా భరించాలనే వాతావరణంలో కళ్ళు విప్పిన మనిషి

విసురుగా అక్కడ్నించి లేచి పోయాను

ఈనాడు వెతుక్కుంటూ మా దగ్గరకి వచ్చాడంటే జీవితంలో పరాజయం తిని వుండాలి డబ్బులున్నప్పుడు పలకరించే చుట్టాలు డబ్బులేనప్పుడు పల్కరించరు

అమ్మని ఏడిపించినందుకు ఫలితం

తను ఏడుస్తున్నా మమ్మల్ని నవ్వించాలని చూసింది "నాన్న ఎప్పుడొస్తారమ్మా'' చిన్న తనంలో తను విసిగించేది

తల్లీ-తండ్రీ తానై పెంచింది నాకూ, అన్నయ్యకీ అమ్మే ప్రపంచం, దైవం అయింది అన్నయ్య ఉద్యోగంలో చేరగానే ఆమె కష్టాలు తీరినాయి

''నీ పెళ్ళయిపోతే నాకేం బాధ లేదమ్మా వెన్నెత్తుకుంటాను."

మేం కొంచెం నిలబడగానే పాత చుట్టాలు కల్సారు ఇదినాకు అన్నయ్యకి బొత్తిగా యిష్టం లేదు కాని అమ్మని కాదనలేక నోర్మూసుకున్నాం

"కుమారి నా కోడలు" అనే వైకుంఠం మామయ్య పదివేలు కట్నం అడిగాడు

"అవతలకి పొమ్మను" అన్నయ్య చిరాకు పడ్డాడు

"కేక లేసుకుంటే ఏమవుతుందిరా అబ్బాయ్ కట్నాలు లేకుండా పెళ్ళిళ్ళు అవుతాయా?"

"పదివేలు ఎక్కడ్నుంచి తేనమ్మా?''

మంచి రోజు చూసుకుని అమ్మ మద్రాసు నాన్నగారి దగ్గరకి బయలుదేరింది మేం వద్దన్నా వినలేదు

"ఇన్నాళ్ళు లేని అభిమానం ఇప్పుడు వస్తుందా ఆయనకి?"అన్నయ్య అన్నాడు

"ఎప్పుడూ మనుషులు ఒకేలా

వుంటాం్రా " మార్పు మీద ఎంతో నమ్మకం అమ్మకి రెండ్రోజుల్లో తిరిగి వచ్చేసింది.

కిరణ్మయి చేతిలో కీలు బొమ్మయి కూర్చున్నాడు

"కట్నమిచ్చి పెళ్ళి చెయ్యక పోతేనేం" అన్నది కిరణ్మయి

నాన్నదానికి వంతపాట

అమ్మ వచ్చినందుకు చాల చిరాకుపడి పోయి ఎప్పుడూ రావద్దని హెచ్చరించారు అక్కడ అమ్మకి ఘోరమైన అవమానమే జరిగి వుండాలి మాతో ఏం చెప్పలేదు నెల్లాళ్ళ దాకా అమ్మలో పరాకు మాసి పోలేదు

ఏం సంబంధం లేదన్న మనిషి ఎందుకు వచ్చినట్లు॰ అన్నయ్య వస్తే అసలు ఊరుకోడు. వాడికి కోపం వస్తే ఆగదు కూడ

"రండి అక్కడే నిలబడిపోయారేం॰" అమ్మ పిలుస్తున్నది ఉలిక్కి-పడి చూశాను నాన్న నిశ్శబ్దంగా లోపలికి వచ్చి కూర్చున్నాడు

"మన కుమారి హైస్కూళ్ళో పని చేస్తోంది "

"ఏమ్మా గుర్తున్నానా " సందేహంగా అన్నాడు

నిర్లక్ష్యంగా చూశాను పెరిగిన గడ్డం సంస్కారం లేనిజుట్టు అలసటగా ముఖకవళికలు ఒకనాటి మా శత్రువు ఈ మనిషి

"కుమారీ" అమ్మ లోపల్నుంచి పిలిచింది.

"టిఫిన్ ఆయన కివ్వు" మా మధ్య వాతావరణం ఏర్పరచడానికి అమ్మ ప్రయత్నిస్తోందని గుర్తించాను.

"వాగ్వివాదం పెట్టుకోక నలుగురూ వినడం తప్ప ఏం లాభం "

పడగనీడలో కాపురంచేసి సంఘం చేతిలో, వ్యవస్థ పిడికిలిలో నలిగిపోయిన అమ్మ, దగా పడిపోయిన అమ్మ డిఫెన్సుగా తయారైంది నాన్నకి ఇది ఆయన అదృష్టం సంఘర్షణ అణచుకుంటూ, టిఫిన్ ఇచ్చాను

నాన్న మందహాసం చేశాడు

## కిరణ్

ఆ రోజు సర్కార్ లేటయింది ఇంటికి చేరేసరికి పది దాటుతోంది సరిగ్గా కరెంటుకూడ పోయింది

కుమారి కొవ్వొత్తి వెలిగించి నా గదిలో పెట్టింది "ఇంత ఆలస్యమైందేమిరా॰" అంటూ అమ్మ గదిలోకి వచ్చింది

"బండి లేటమ్మా" లుంగీ చుట్టుకుని ఈజీఛేర్‌లో కూర్చున్నాను

"ఏమయింది వెళ్ళిన పని॰"

"శనివారం వస్తానన్నారు కుమారిని చూసుకునేటందుకు ఇంచుమించు ఆ రోజే తాంబూలాలుకూడ కిశోర్‌కి అభ్యంతరమేమీ లేదు "

"వాళ్ళ బాబాయి ఏమంటాడో కదట్రా "

"కిశోర్‌దేనమ్మా అంతా వాళ్ళ బాబయ్య పెద్దమనిషిగా గౌరవానికి తప్ప ఆయన చేతిలో ఏమీలేదు "

"అంతా వాడి దయ లే బోంచేద్దువు గాని "

పురాణ హాస్యవృక్షం!




"ఆకలి లేదమ్మా కిశోరూ నేను బయలుదేరేముందు లోడ్‌గా టిఫిన్ తీసుకున్నాం కాస్త కాఫీ ఇవ్వు "

"నేను పెడతాలే నువ్వు వెళ్ళి పడుకో" కుమారి లేచింది

బాత్‌రూంలో ముఖం కడుక్కొని వచ్చేసరికి కుమారి వేడి కాఫీతో రెడీగా వుంది "నీకో గుడ్ న్యూస్ రా అన్నయ్యా?"

"చెప్పు" కాఫీ త్రాగుతూ అన్నాను

"నా పెళ్ళి విషయమై ఇంక నువ్వు తిరగనక్కర్లేదన్నమాట "

"నువ్వే తిరుగుతావా?" చెవి పట్టుకున్నాను

కుమారి విడిపించుకుంటూ "అమ్మా! చూడవే కొడుతున్నాడు" ఫిర్యాదు చేసింది గట్టిగా

"ఏమిటే రాత్రివేళ కేకలు?" అమ్మ మందలింపుగా అంది

"చెప్పండి మిసెస్ కిశోర్ వినడానికి సిద్ధంగా వున్నాను "

కుమారి ముఖం గులాబి రంగులోకి వచ్చింది "ఇంకా మనం వర్తమానంలో వున్నాం అన్నా "

"పార్డెన్! శుభవార్త వినిపించావు కాదు."

చిలిపిగా నవ్వుతూ "నువ్వు ఆవేశపడకూడదు అరవ సిన్మా హీరోలా గంతులు వెయ్యకూడదు ఇతర ప్రశ్నలతో మమ్మల్ని వేధించకూడదు" అంది కుమారి

"నీ షరతులకీ నీకు నమస్కారం.

దయచెయ్ నాకు నిద్ర వస్తోంది "

"నీకు ఇది లేనప్పుడు ఎందుకులే!" కుమారి వెళ్ళడానికి లేచింది

సస్పెన్సు ఏమిటో తెల్సుకోవాలని ఇదిగా వుంది కుమారి మొండి ఘటం చెప్పనంటే చెప్పదు కూడా!

"ప్లీజ్! చెప్పవూ" ఆత్రంగా అడిగాను

కుమారి దగ్గరగా వచ్చింది "మధ్యాన్నం మనింటికి ఓ అతిధి వచ్చారు మనం కొన్నాళ్ళు ఆయన కోసం ఎదురు చూసి విసిగి మానేశాం "

అంతరంగంలో ఒక బొమ్మ కనిపి స్తోంది "అంటే "

"నా న్న "

కాస్సేపు ఏం మాట్లాడలేకపోయాను. పిచ్చిగీతల్లా రకరకాల ఆలోచనలు ఆవరి స్తున్నాయి కుమారి చెప్పిన నిజాన్ని రిసీవ్ చేసుకునే స్థితిలో లేను

"కుమారీ వచ్చి పడుకో" అమ్మ కేకతో వెళ్ళిపోయింది కుమారి

హిగిన్‌బాదమ్స్‌లో కొన్నఆర్ కె నా యణ్ నవల చదవాలనిపించలేదు - లైటు ఆర్పి పడుకున్నాను నిద్రరాకపోయినా

ఫ్యూడల్ వ్యవస్థలోని భూస్వామి నాన్న పంట కళ్ళంలో తయారయ్యేసరికి వచ్చాడు వ్యవసాయంలోని ఇన్నాళ్ళు చేసిన పరిశ్రమ అక్కర్లేదు సులభంగా ప్రతిఫలం కావాలి అంతే!

---




మేం ఒకదశకి చేరుకున్నాకా మాయమైన బొమ్మ తిరిగి కనిపించింది ఈ సంసారంతో తన అనుబంధాన్ని బాధ్యతని తిరిగి పొందడానికి

"రోగ్" ఆవేశంతో నా వొళ్లంతా కంపించింది

సాగే కాలంలో తన సరదాలు, స్నేహాలు తీర్చుకుంటూ, మమ్మల్ని గాలికి వదిలేసి ముఖం తప్పించాడు తన చుట్టూ సందడి ఆగిపోయేసరికి మేమంతా గుర్తుకు వచ్చివుంటాం

అమ్మ దానికే పొంగిపోయి వుంటుంది

ఇదంతా ఆమె మంచితనం వల్ల జరిగింది ఇది ఆయనకి అసమర్థత క్రింద కనిపించి వుంటుంది మరొకరయితే మాసంగతేమిటని — రూపాయిలతో నష్ట పరిహారాన్ని కోరేవారు

అమ్మ పరాన్నజీవికాదు గరళాన్ని మ్రింగి డాక్టర్ రామభద్రరాజుగారి దగ్గర నర్స్‌గా చేరింది ఆయన వాత్సల్యం, అభిమానంవల్ల కుటుంబం వంకరటింకర దారుల్నుంచి రోడ్డు ఎక్కింది

నా కుద్యోగం రాగానే అమ్మని డ్యూటీ మానెయ్యమన్నాను

"చెల్లాయికి పెళ్ళికూడ కానీ "

"తక్కినవి నేను చూస్తాను ముందర నువ్వు రెస్టు తీస్కో" జీవితకాలమంతా అన్నివిధాల ఆమె సేవలు పొందడం దోపిడీక్రింద కనిపించింది

"వీటికి నేను వారసుడ్ని" అంటూ సిద్ధమయ్యాడు నాన్న

పాత్రలు నాలుగూ రంగంలోకి వచ్చాయి చతురస్రం ఏర్పడింది దానికి కారణం కాశీపతి అతడు వెళ్ళకుండా వుంటే, రాకుండా వుంటే సమస్యే లేదు

కాశీపతి ముద్దాయి కాదంబరి అతడి భర్తృరికంచేత మన్నించగలదు కాని అంతటితో ఆఖరవదు పిల్లలు ఎదిగారు వాళ్ళ అనుమతి కావాలి

తండ్రి నిష్క్రమణతో కుటుంబానికి గండి పడిందని కిరణ్, కుమారి గుర్తించారు, తన బాధ్యతని తప్పించుకొని యిప్పుడు కొత్తగా ప్రవేశం చెయ్యడం వారికి నచ్చలేదు తండ్రి లేడనుకునీ పెరిగారు ఉన్నాడని యిప్పుడు భావించడం, ప్రవర్తించడం వారికి కొత్తగా ఉంది ఒకరకమైన విధానానికి సమాజంలో అలవాటు పడినవాళ్ళు తండ్రిని స్వీకరించి నలుగురికీ పరిచయం చేసే ధైర్యం తెచ్చుకోలేక పోతున్నారు.

ఆ రోజు సెలవు కిరణ్ లేచేసరికి తొమ్మిదయింది బ్రష్ తీసుకొని పెరట్లోకి వస్తూ వంటింటిలోకి తొంగిచూశారు తల్లి పూజలో వుంది కుమారి కూరలు తరుగుతోంది

"ఆయనింకా వెళ్ళలేదేం? ఉండమన్నావా?"

కాదంబరి కొడుక్కేసి విసుగ్గా చూసి "నే నెందుకంటాను? మీ హయాంలోకి వచ్చాం కదా" నిష్ఠూరంగా అంది

కిరణ్ చురుగ్గా చూసి వెళ్ళిపోయాడు వేగిరం స్నానం ముగించి బట్టలు వేసుకుంటూంటే కుమారి కాఫీ యిచ్చింది కాశీపతి లోపల కొచ్చి "కుమార్" అన్నాడు

కిరణ్ మాట్లాడలేదు

"మిమ్మల్ని ఓసారి చూసిపోదామని వచ్చాను" కాశీపతి తటపటాయించాడు మాట్లాడడానికి బెరుకుగా వుంది

"ప్రేమ ఒలికిపోతోంది మరి" వెటకారంగా నవ్వాడు

కాశీపతి మాట్లాడలేదు కుమారి తల్లిని పిలిపించుకొచ్చింది ఘర్షణ పెరుగుతుందని ఆమె భయపడింది

"ఇన్నాళ్ళు మీరు చేసిన తప్పుకు మేం శిక్ష అనుభవించాం మీ తప్పుకి మీరే యిప్పుడు శిక్ష అనుభవిస్తున్నారు' దయ చేసి యిలా ఎప్పుడూ రావద్దు ఎవరిని ఎవరయినా అడిగితే చెప్పడానికి నా దగ్గర సమాధానం లేదు" రంపపు కోతలా వున్నాయి మాటలు

కాశీపతి తల కృంగిపోతోంది

"ఎందుకురా లేనిపోని పేచీ" కాదంబరి కొడుకుని అనునయించ బోయింది

తల్లి సంజాయిషీతో కిరణ్ మరింత పిచ్చివాడయ్యాడు కాశీపతి నానావిధాల చెరిగిపోశాడు ఆవేశంతో

గాలి వాన తయారైంది

"ఎందుకురా నువ్వు కంఠం చించుకుంటావ్? బాధపడింది నేను నాకు లేని కోపం నీకెందుకు?" కాదంబరి గర్జించింది

కిరణ్ కందగడ్డలాముఖం చేసుకుని వెళ్ళిపోయాడు తల్లి తనని అర్థంచేసుకోవడం లేదని బాధపడ్డాడు

"మీ మధ్య పోట్లాటలు పెట్టడానికి రాలేదు కాదంబరీ నన్ను పోనివ్వు"

"మీతోబాటు నన్నుకూడ తీసుకెళ్ళండి వాళ్ళకి నా అవసరంలేదు అన్నా చెల్లీ పెద్దవాళ్ళయ్యారుగా"

 

పురాణ హాస్యవృక్షం!




కుమారి తల్లిని ప్రతిమాలింది

"పూర్వోక్లే అమ్మా అన్నయ్యసంగతి నీకు తెల్సిందేగా నెమ్మదిగా నచ్చచెబితే వాడే వింటాడు"

కాదంబరి మీద ఆ హామీ పనిచేసింది ఆనందం తొణికిసలాడింది భార్య తనకి డిఫెన్సుగా రావడం కాశీపతికి ఆనంద మయింది భార్యమాట కొట్టివేయలేక వుండిపోడానికే నిశ్చయించుకున్నాడు

కుమారి తండ్రికి తలంటు పోసింది బజారుకెళ్ళి కొత్త బట్టలు తెచ్చింది కాదంబరికి పండగలా వుంది

సాయంత్రం వచ్చాడు కిరణ్ "అమ్మేది?" నిశ్శబ్దంగా వుండటం చూస డిగాడు కుమారిని కుర్చీలో కూర్చుంటూ

"ఇద్దరూ గుడికెళ్ళారు" కుమారి టిఫిన్ యిచ్చింది

"అలాగా"

"నాన్నగారు యిక్కడ వుంటేనే అమ్మ వుంటుందిట నేను బలవంతంగా ఆపాను ఆయన అవసరం యివాళ మనకి లేకపోవచ్చు కానీ మనం మాన వత్వం మరచిపోవాలా? అమ్మ ముఖ మయినా చూసి మనం నాన్నని మన్నిం చాలి"

కిరణ్ కాఫీ త్రాగుతూండగా బయట రిక్షా ఆగింది కిరణ్ కిటికీలోనుంచి చూశాడు తల్లీ—తండ్రీ అతడి కళ్ళలో వింత కాంతి

"ఈ బొమ్మకోసమే కదరా మనం చిన్నప్పుడు కలవరిస్తే" మార్దవంగ అన్నది

కిరణ్ చటుక్కున దగ్గరకెళ్ళాడు "నాన్నా"

సీ రి య ల్

# జై మంగళా

ఎ. శ్యామలారాణి

జరిగిన కథ చిన్నతనంలోనే తల్లి దండ్రుల్ని పోగొట్టుకున్న మంగళకు అండగా నిలిచి ఆమె ఆస్తిపాస్తుల్ని సంరక్షించి ఆదరించాడు చౌదరి రామం కుటుంబంలో దాదాపు ఒక మనిషిగా మసలేది మంగళ రామం భార్య గౌరి అంటే ఎంతో అభిమానం రామం తమ్ముడు రాజంటే ఎంతో అనురాగం ఆమెకు. హఠాత్తుగా రామం మరణించాడు ఆ బాధ తట్టుకోలేని రాజు మనశ్శాంతికోసమని చెప్పి గమ్యంలేని యాత్రకు బయల్దేరాడు కన్నకు ప్రమాదకరమైన జబ్బు చేస్తే మురళిబాబు వైద్యంచేసి ఆదుకొన్నాడు మురళిబాబు, గౌరిల మధ్య అక్రమ సంబంధా న్నారోపించి గ్రామస్థుల మధ్య నిందితులుగా నిలబెట్టాడు రంగనాథం మంగళ ఆ అవకాశాన్ని ఉపయోగించుకొని మురళిబాబు, గౌరిల వివాహం జరిపించింది మురళిబాబు గౌరినీ, కన్ననూ తీసికెళ్ళి పోయాడు రాజు తిరిగొచ్చాడు చెప్పుడు మాటలు విని గౌరిని అపార్థం చేసుకున్నాడు చౌదరి కొడుకు గోవిందుకు పెద్ద సంబంధం చూస్తుం డగా గోవిందు, తను ప్రేమించిన కృష్ణవేణిని గుళ్ళోపెళ్ళి చేసు కొన్నాడు అందుకు మంగళ సహకారం వుందని తెలిసి చౌదరి మంగళపై మండిపడ్డాడు రాజుకి మంగళపై కోపమొచ్చింది రంగ నాథం దుర్బోధనమ్మి రాజు మంగళను అవమానించాడు చౌదరిగారికి మంగళ తాతనని పరిచయం చేసుకొంటూ ఉత్తరం వ్రాశాడొకాయన ఆ ఉత్తరంలో మంగళ తల్లిదండ్రుల కథ వివరించబడుతూంది

ఈ రోజు చాలా మంచి రోజు దేవుడు పోయినా మేమూ పెండ్లి చేసుకునే చాలా ఆర్భాటంగా పెండ్లి చేసుకుంటు దూరం వెళిపోతున్నాం నాకోసం వెతి న్నాడు అటువంటి ఆర్భాటాలేమీ లేక కించకండి నేను చేసిన ఈ పని మీ దృష్టి

లోను మీ చుట్టూ ఉన్నవారి దృష్టిలోను చాలా నికృష్టపు పనిగా తోచవచ్చు మీ రెప్పుడూ ప్రేమగా చూడటమే నేనెరుగు దును అందుచే ఇప్పుడు అసహ్యించుకుని ... మాటాడినా నేను భరించలేను మన ...లు మారి, నా రాకను మీరామో ...ంచగలరన్న నమ్మకం కుదిరితే తప్ప మీ ఎదుట పడలేను క్షమించండి

"చౌదరిగారూ! పార్వతి చెప్పింది నిజం ఆమె చేసిన పనిని అందరూ గర్హించారు నా బాధ నెవరూ అర్థం చేసు కోలేదు నేను మోడులా మిగిలిపోయాను వినరాని మాటలు వింటూ అక్కడ ఉండ లేక ఆ ఊరు వదలి పెట్టి ఇక్కడికి వచ్చే శాను ఇక్కడ కొత్తగా ఫ్యాక్టరీ పెట్టి, పాత సంగతులన్నీ మరచిపోవాలని ధనా ర్జనలో పడ్డాను చివరికి ఇప్పుడా ధనం తప్ప ఇంకే ఆనందమూ మిగలలేదు నాకు

"రామినాయుడుగారు మా ఇంటికి వచ్చిన సందర్భంలో పార్వతి ఫోటో చూడటం తటస్థించింది తల్లికి, కూతు రికి చాలా పోలికలు ఉండటం చేత అతను అదిరిపడి, ఆ ఫోటో వివరాలడగటంతో అసలు సంగతి బయటపడింది తరువాత జరిగిన విచారకరమైన సంగతులన్నీ తెలి సాయి, నా అన్న వాళ్లు లేక, ఒంటరితనం భరించలేక ఒక కుర్రవాడిని చదువు చెప్పిస్తూ దగ్గరుంచుకుని, ఎలాగో రోజులు దొర్లిస్తున్న నాకు నా స్వంత మనుమరాలే ఉన్నదని తెలిసాక కలిగిన ఆనందం వర్ణ నాతీతం ఇకపై ఆ పిల్లను విడిచి ఉండ గలగటం దుర్భరం

"ఇంత ఐశ్వర్యమూ ఉండి తన తల్లి, తండ్రి అలా వేరుగా వెళ్ళిపోవటానికి, ఆమె ఇన్నాళ్ళుగా దిక్కూ మొక్కూ లేకుండా అనాధగా మిగిలిపోవడానికి కారణం నేనేనని,తప్పంతా నాదేనని అను కుంటే పెద్దవాడినని యోచించక నన్ను మన్నించమని చెప్పండి తిరిగిరాని పార్వ తిని ఆమె బిడ్డలో చూసుకుంటూ మిగిలిన కాలాన్ని ఆనందంగా గడపాలన్న నా ఆశను నిరాశచేయవద్దని నేను కోరానని మరీమరీ తెల్పండి ప్రేమతో పెంచి పెద్ద చేసిన మీ మాటను ఆమె తిరస్కరించ దన్న ఆశతో నా గాధనంతా తమకు మనవి చేశాను

"రాబోయే శుక్రవారం మాఘశుద్ధ ఏకాదశి నా పార్వతి నన్ను నిర్దయగా విడిచిపెట్టి పోయిన రోజు ఆ రోజుకి నా మనుమరాలు నా ఇంటికి రావాలని నా ఆపేక్ష నేనే స్వయంగా వస్తున్నాను తమవంటి ఉత్తముల దర్శనం కోసం కూడా తహతహలాడుతున్నాను చనువు తీసుకుని తమకీ విధంగా వ్రాసినందుకు అన్యధా భావించరని ఆశిస్తాను

సెలవ్,

భవదీయుడు,

రంగారావు"

ఉత్తరం పూర్తి చేసిన వసుమతి చౌదరి అతి ఆశ్చర్యంగా ఒకరి ముఖంలో నొకరు చూసుకుంటూ కాసేపలా చలనం లేకుండా ఉండిపోయారు చౌదరి ఆనందం వర్ణనాతీతంగా ఉంది మంగళ ఫలానా అనుకుంటూంటే అతనికి చతుర్భుజాలూ మొలిచినట్లయింది ఆ సంతోషంలో గోవిందు చేసిన పని, దాని వలన అతనికి కలిగిన వేదన ఎటో ఎగిరి పోయాయి



"దాని అదృష్టరేఖ ఇప్పటికి బయట పడింది నాన్నా! కలా నిజమా అని నాకే నమ్మ బుద్ధి కావటం లేదు!" అంటూ ఒకటే సంతోషపడి పోతూంది వసుమతి

"అది పులిపిల్ల అని ఎప్పుడూ అనుకునేవాడిని - కాని బొబ్బిలి పులి కూడా అని ఇప్పుడే తెలిసింది తర తరాలుగా ప్రవహించుకొస్తూన్న సాహసిక రక్తపు జాడ లెక్కడికి పోతాయి మరి? ఏదీ, కబురు పంపించు దానికి, వేగం—కేశవుల్నిలా పిలూ!" అంటూ కంట్లో సన్నని నీటి తీరమెరుస్తూంటే హడావిడి పడిపోతున్నాడు చౌదరి

"వద్దొద్దు—నేనే స్వయంగా మంగళ కీ శుభవార్త ముందుగా చెప్పాలి—నేనే వెళ్తా నాన్నా" అని చెప్పుల్లో పాదాలుంచి చకచక రాజు ఇంటికేసి నడక సాగించింది వసుమతి

* * *

గుమ్మంలో రాజు దిగాలుగా కూర్చొని ఉన్నాడు

"రాజూ! మంగళెక్కడ?" గుమ్మంలో అడుగింకా పెట్టకుండానే, అలసట తీర్చు కుందికి క్షణమైనా ఆగకుండానే అడిగింది వసుమతి

"మీ ఇంటికి రాలేదా?" ఆశ్చర్యంగా, బరువుగా పలికిందతని కంఠం

"అదో పెళ్ళిళ్ళ పేరమ్మ—ఇంకెక్కడ తిరుగుతోందో ఏమిటో! ఈ సంగతి విన్నావా రాజూ! మంగళెవరో తెలుసా? మనం ఇన్నాళ్ళూ అనుకున్నటు దిక్కుమాలిన పిల్లేంకాదు పేద్ద ఆస్తికి డికి స్వయాన మనుమరాలు, ఎకైక సురాలు" అంటూ ప్రారంభించి గుక్కతిప్పుకోకుండా క్షణంలో గడ అంతా ఏకరువు పెట్టేసింది

రాజు శిలావిగ్రహంలా ఆశ్చర్యం నోరు తెరుచుకుని నిల్చునే ఉన్నాడు

"ఏం బోధపడిందా? ఇంతకీ చెప్పొచ్చే దేమిటంటే ఇన్నాళ్ళూ వీళ్ళూ వాళూ కూసినట్టు అదేం కులగోత్రం లేని పిల్ల కాదోయ్ బొబ్బిలి వెలమవారి సిల్లంటే ఏమనుకున్నావ్? బొబ్బిలి పులి రాజూ! అది నిజంగా బెబ్బులే!" అని నవ్వుతూ వచ్చి నంత హుటా హుటిని గడపదాటింది

రాజుకి కొరడాతో ఛళ్లున తగిలించి నట్టయింది వాళ్ళు వీళ్ళు అన్నారనే వసుమతి అనుకుంటూంది తను కూడా అదే కూసేదని తెలుస్తే? రాజుకి మనసు మన సులో లేదు అంతవరకు మంగళ ఎదుటికి వెళ్ళి ఎలా క్షమార్పణ కోరాలా అనే యోచిస్తున్నాడు ఇప్పుడా అవకాశం కూడా జారిపోయినట్టుం దతనికి

అలాంటి మాట పొరపాటున అనేసి నందుకు తనెంత హింసపడుతున్నాడో మంగళ కెలా తెలుస్తుంది? తన కుల గోత్రా లేమిటో, తనకు కలిగిన అదృష్ట మేమిటో తెలిసాక క్షమాపణ కోరడానికి వచ్చాడనుకుంటే? సందేహ మెందుకు? తప్పకుండా అలాగే అనుకుంటుంది — అనుకోవడమేమిటి? అనగల ధైర్యం కూడా ఉందా పిల్లలో - ఒకవేళ ఏకారణం వల్లనయినా మంగళ ఊరుకున్నా, సంగ

పురాణ హాస్యవృక్షం!




తంతా తెలిస్తే వసుమతి తప్పకుండా అనేస్తుంది అలాంటప్పుడు తనందరిముందూ తలెత్తుకుని తిరగగలడా?

అదీకాక తనలాంటి రాజుల్ని వంద మందిని కొనేయగల స్థితిమంతురాలయి పోయింది. మంగళీవాళ—రాజు వికలమైన మనస్సుతో యేదో నిర్ణయానికి వచ్చేడు.

అప్పుడే పశువులు తోలుకెళ్ళడానికి అప్పిగాడొచ్చేడు

"అప్పిగా— నే నర్జంటుగా ఊరికెళ్ళ వలసొచ్చింది—నే నొచ్చేవరకూ ఈ పశువుల్ని చూసుకో—ఈ పాతికరూపాయలు నీ దగ్గరుంచు 'దానా' కొనాలికద!" అనేసి ప్రయాణపు సందట్లో పడ్డాడు

## 19

ఆవేళప్పుడు మంగళకూడా సరిగ్గా అలాంటి ప్రయత్నంలోనే ఉంది లలిత ఎంతో బతిమాల్తోంది ఏమో అనునయిస్తోంది ససేమిరా వినిపించుకోవటం లేదు మంగళ

అప్పుడే గుమ్మంలో అడుగు పెట్టిన వసుమతి ఎదురుగా ఉన్న లలితకు తనకు వెను తిరిగి కూచున్న మంగళకు తెలియనివ్వవద్దన్నట్లుగా సౌజ్ఞ చేస్తూ మెల్లగా చెప్పులు విడిచి, కుచ్చెళ్ళు ఎత్తిపట్టుకుని అడుగులో అడుగేసుకుంటూ వచ్చి వారగా నిలబడింది

"అయినా నీ నిర్ణయం మంచిదికాదు మంగళా! ఊరొదిలి మరో చోటుకి పోవడమంటే తమాషా అనుకున్నావా? పుట్టిన దగ్గర్నుంచి ఈ పాలెం తప్ప మరో ప్రదేశం ఎరగవు నువ్వు. ఆడపిల్లలు, అందులోనూ ఇలాంటి పయస్సులో ఉన్న



పిల్లలు బయటకు వంటరిగా వెళితే ఎంత ప్రమాదమో తెలుసా? చాలా ఆవేశంలో ఉన్నావు బాగా ఆలోచించు" లలిత బోధ పరుస్తూంది

"అంతా ఆలోచించేను ఏమయినా సరే ఇంకొక్క క్షణం కూడా ఈ పాలెంలో నేనుండలేను" మరీ నిక్కచ్చిగా చెప్తూంది మంగళ

"పోనీ ఎక్కడికెళ్తావో చెప్పు"

మంగళ విసుక్కుంది. "ఎక్కడికి మా తాత దగ్గరికి! ఇక్కడ మాత్రం నాకెవరున్నారిక? నా కెవ్వరూ లేరు-నాకెవ్వరూ లేరు" అంటూంటే గొంతు బొంగురుపోయింది

వసుమతి చటుక్కున వచ్చి మంగళ రెండు భుజాలమీదా చేతులు వేసింది. ఉలిక్కిపడిన మంగళను మరింత ఊపేస్తూ "వెళదూగాని మంగళా-వెళదువుగాని మీ తాత దగ్గరికే వెళదువుగాని - నువ్వు వెళ్ళడ మేమిటి? నిన్ను తీసుకెళ్ళడానికి మీ తాతే వస్తూంటే!" అంది

"పరాచికాలాడకు వసూ! నేను నిజంగానే చెప్తున్నాను-నేనిక్కడుండలేను" ఉదాసీనంగా వసుమతిని వదుల్చుకుంటూ అంది మంగళ

"పరాచికాలు కాదే ఇడియట్! ముందీ ఉత్తరం చదువు" అని వీపు మీదొకటిచ్చి ఉత్తరా న్నందించింది

వసుమతి బలవంతాన యధాలాపంగా ఉత్తరంలో నాలుగయిదు లైన్లు చదివి కుతూహలంగా ఏక బిగిని పూర్తి చేసిన మంగళ నిశ్చేష్ట అయి నిల్చుండిపోయింది

"అసలీ పాలెంలో పుట్టవలసిన పిల్లవి కావే' అని నే నెప్పట్నుంచో చెప్పే దాన్ని చూశావా? పద పద వేగం-ఇంటికి నాన్న నీ కోసం, నిన్నటి నుంచీ ఒకటే కంగారెత్తిపోతున్నారు" అంటూ మంగళ రెక్క పుచ్చుకుని ఈడ్చుకుంటూ పరుగెత్తింది వసుమతి

ఈ వార్త పాలెం మొత్తమంతా క్షణాలమీద ప్రాకిపోయింది "నిజమే?" అంటూ తెల్లబోతున్నారంతా

తనకేదో మహా అదృష్టం పట్టినట్లు పొంగిపోతూన్న చౌదరిని చూస్తే, తొలి రోజు అతను పడిన బాధ జ్ఞాపకం వచ్చి చెప్పలేని జాలి వేసింది మంగళకు "నే చేసిన పనికి మీకు చాలా కోపం వచ్చింది కదూ!" అంది మెల్లగా ఆ కంఠంలో ఎన్ని క్షమార్పణ లున్నాయో చౌదరికే తెలుసును

"నా దసలే ప్రధమ కోపం ఏదో అన్నాను - అప్పుడే మరిచిపోయాను అయినా గోవిందుగాడి మీదే లేని కోపం! నీ మీ దెందుకే వెర్రి పిల్లా!" అన్నాడు

'గోవిందుగాడి మీదే లేని కోపం' అన్న ముక్క వింటూంటే మంగళ వదనం వికసించింది తనకు కావలసిన దదే ముఖ్యంగా

తొందరగా రాజుని తీసుకు రమ్మని కేశవుల్ని పంపేడు చౌదరి తన కుల గోత్రా లేమిటో ఇప్పుడు తెలుసుకున్న రాజు ముందు ఎంతటి సగర్వంగా నిల్చుంటానా? అని ఒకటే తహ తహ లాడు

తూంది మంగళ

కాని. "రాజుబాబు ఊరెళ్లిపోనాట్ట!" అని కేశవులు తెచ్చిన కబురు వింటూనే మంగళ పూర్తిగా నీరుగారిపోయింది. అంతటి శుభవార్త విని మంగళ నభినం దించడానికి రాకపోగా ఊరొదిలిపోయి నందుకు మరీ ఇల్లిటరేట్‌లా బిహేవ్ చేస్తాడని వసుమతి విసుక్కుంటూంది.

ఒకనాడు గౌరీతో 'సవ్యంగానే జవా బిచ్చాన'న్న రాజు ఆంతర్య మేమిటో పొత్తిగా అంతుపట్టనట్లయి పోయింది మంగళకి. ఏమిటా సవ్యమైన సమా ధానం? ఇదేనా? ఆ మాటకొస్తే రాజు తనంత తానుగా ఒక్కనాడయినా తమ పెళ్ళి సంగతి ఎత్తాడా? అందరితోపాటు తనూ పొరపాటు పడిందేమో! రాజు కలాంటి ఉద్దేశ్యమే ఉంటే, మాటా మాటా అనుకున్నందు కేదో విధాన రాజీకి రావటం పోయి ఇలా ఖాతరు లేకుండా ఏకంగా ఊరొదిలి పోతాడా? రామం మాట జవ దాటలేక, బలవంతాన మనసుని శాసించు కోవాలనుకున్నా, తనపై రాజుకి నిజంగా అటువంటి ఉద్దేశ్యం లేదేమో! లేకుంటే "హక్కు లేదు-వద్దు కూడా' అని నిష్కర్షగా చెప్పగలిగేవాడేనా?

ఇలాంటి ఆలోచనలు రాబోయేసరికి మంగళకి భూమి తలక్రిందులైనట్లయింది.

''ఏం మంగళా! రాజు ఊరు కెళుతు న్నానని నీతో మాట మాత్రమైనా అన లేదా?'' అని అడుగుతోంది వసుమతి.

తన మనస్సంఘర్షణ ఏమాత్రం బయటపడి ఎవరు సానుభూతి, జాలి చూపినా అది మరీ ఘోరావమానమని పించిన మంగళ పెంకెగా అంది.

"నాతో అనవలసిన అవసరం మాత్రం ఏమిటి?"

"బాగుంది-బాగుంది చాలా బాగుంది- రేపో నేడో కాబోయే..."

"ఏమిటా కాబోయే? ఎత్తేస్తే ఏడు చెక్కలు!" వసుమతి మాట మధ్యలోనే తుంచింది మంగళ.

"అవేం కబుర్లే! 'శుభం పలకరా పెళ్ళికొడుకా' అంటే, 'పెళ్ళి కూతురు ముండేదీ?' అన్నట్టు కొంపతీసి ఏమైనా దెబ్బలాడుకున్నా రేమిటి?" గుట్టుగా మోచేత్తో పొడుస్తూ అడిగింది వసుమతి.

"నాకేమిటవసరం అతనితో దెబ్బలాడ టానికి?" నిర్లక్ష్యంగా అడిగింది.

"అయినా రాజు అలాంటివాడు కాదే! చాలా నిదానమైనవాడు తగు మనిషి!'' ఏదో అనబోయాడు చౌదరి.

మంగళ గట్టిగా రుంజుకుంది. "ఆఁ ఆఁ అవును. అతడు ఇంద్రుడు, చంద్రుడు-నేనో అఖాడా సరుకుని-అలాం టప్పుడు మా కిద్దరికీ పెళ్ళవుతుందనెలా అనుకుంటున్నారు?"

చౌదరీ, వసుమతీ తెల్లముఖా లేసారు.

"ఈవాళ కొత్తగా ఎవరనుకున్నారు? రామం బ్రతికుండగానే నిశ్చయమైం దిటగా! గౌరి స్వయంగా చెప్పింది నాతో ఊరూ, వాడా అనుకుంటూనే ఉన్నారు!" అన్నాడు చౌదరి కొంచెం తెప్పరిల్లి.

"అసలు వాళ్ళనుకోలేదుగాని ఊరూ వాడా అనుకున్నారు! ఏమిటి ప్రయోజనం?" 'అసలువాడు' రాజు అలా అనుకోలేదను కోవటానికి మంగళ ఎంత కుమిలి



పోతూందో చూసే వాళ్ళకి అర్థం కాలేదు.

"నే న్నమ్మ లేను!" చౌదరి తల విదిలించాడు

"మీరునమ్మినానమ్మక పోయినా ఇది నిజం-రాజు కేం అలాంటి ఉద్దేశ్యం లేదు" పొరపాటున నోరు జారానని గతుక్కుమంది మంగళ

"ఓహో! అయితే నీకూ లేదనేనా దాని అర్థం?" ఎత్తిపొడిచినట్లడిగింది వసుమతి

తనకు ఉండి రాజుకి లేదనుకుంటే అది భరించరాని అవమానం!

"ఎందుకుండాలి? నన్ను ఖాతరు చెయ్యనివాళ్ళని పిసరంత నేను కూడా ఖాతరు చెయ్యనని ఎప్పుడో చెప్పేను!" బిరుసుగా తలెగరేసింది మంగళ

* * *

సాయంకాలం వేళకి "ఏమే కోడలు పిల్లా! ఏమిటొక్కసారి తంతే దూది పరుపుమీద పడ్డావ్—మమ్మల్ని మరచి పోలేదుకదా?" అని, ఆప్యాయత, చమత్కృతి మిళాయిస్తూ, ముసిముసినవ్వులు నవ్వుకుంటూ ప్రవేశించాడు రంగనాధం

మంగళ చురుగ్గా చూసింది "అబ్బే-ఎలా మరుస్తాను మావయ్యా! కాని, ఎంచేతో మళ్ళీ కోడలుపిల్లా అంటున్నావు—సుబ్బన్నబావగాని మళ్ళీ పిగ్గుపడతాడేమోనని!" ఆ మాట విన్న వసుమతి కిసుక్కున నవ్వింది

అయినా రంగనాధం ఉడుక్కోలేదు. "నీ ఇల్లు బంగారంగానూ, ఏదో చిన్నప్పుడన్నమాటదగ్గర్నుంచీ నీకెంత జ్ఞాపకమే అమ్మా! అయినా, ఎన్నాళ్ళా పిగ్గు! ఎంతదృష్టం చేసుకుంటే గాని, నీలాంటి పెళ్లాం దొరుకుతుంది? రాజుగాడికంటే— నష్టజాతకుడు—బుద్ధి పెడతలబట్టి, వాడి ఖర్మలా కాలిందిగానీ— మ రో డ యి తే కళ్ళకద్దుకుంటూ చేసుకోడూ!" చకచక వల్లించేసాడు

మంగళ ఆ మాటలు వింటూనే ఉలిక్కిపడింది

వసుమతి 'క్లూ' దొరికిపోయినట్టు ఆత్రంగా మరికొంచెం ముందుకు వొంగి "ఏమన్నావూ?" అంది

"అవునమ్మా! ఓడలు బళ్ళవుతాయి-బళ్ళు ఓడలవుతాయని ఎరగక నిన్నటికి నిన్న నాముందే యెంత ఖచ్చితంగా చెప్పాడో తెలుసా? మన మంగళ కులగోత్రాల్లేనివాళ్ళకు పుట్టి మట్టూ మర్యాదా లేకుండా అఖాడాగా పెరిగిందట? 'నేనేమిటి? నా స్టేటస్సేమిటి! దాన్ని పెళ్ళాడే వరకూ నాకేం ఖర్మపట్టింది!' అని కుండ బద్దలుకొట్టినట్టు చెప్పేస్తేనే!" తను రాజుకి నూరిపోసిన మాటలన్నీ రాజే అన్నట్లుగా అతి చాకచక్యంగా చెప్పేడు రంగనాధం.

పళ్ళు పటపటలాడిస్తూ తా డె త్తు న లేచింది వసుమతి

"రష్టిక్! అలా అన్నాడా?! ఇన్నాళ్లూ ఏదో చదువూ, సంస్కారం ఉన్నవాడనుకున్నాన్నేను అసలుసంగతిదన్నమాట-నాకు కొంచెం ముందుగా తెలుసుంటే పెట్టవలసినవి నాలుగూ నేనే పెట్టేసే దాన్ని, అలాటివాడిని కట్టుకునే ఖర్మ మా మంగళకు పట్టలేదని ఈసారతను కను




పిస్తే నువ్వయినా చెప్పు!" నిప్పురవ్వలు కురిపించింది వసుమతి

కాని, మంగళకు కోపం రాలేదు ఇన్నాళ్లూ తనను 'నష్టజాతకురాలని' కావలసినంత ప్రచారం చేసి, ఈవాళిలా అంటున్నాడంటే అంత అర్థంచేసుకోలేని వాజమ్మ కాదు మంగళ. తొలిరోజు రాజు ఆడిన మాటలకు, ప్రస్తుతపు రంగనాధం ధోరణికి సమన్వయం కుదుర్చుకుంటూ ఓరకంట అతనినే గమనిస్తుంది

"ఇంకేం కనిపిస్తాడులే! ముఖం చెల్లద్దూ? తనలాంటివాడినిక మన మంగళ కన్నెత్తయినా చూడదన్న సత్యం ఈపాటి కర్ధమయే ఉంటుంది—అందుకే చెప్పా చెయ్యకుండా ఊరొదిలిపోయుంటాడు— మొత్తానికిప్పుడు తను ఎద్దేవా చేసిన మంగళే తన తలదాటిపోయిందన్న ఈర్ష్య అనుకుందూ!" ఎంతో శ్రమపడి అతికేలా చెప్తున్నాడు రంగనాధం

మంగళ చట్టున లేచి లోపలికి వెళ్ళిపోయింది

ఇదంతా రంగనాధం వెనుకతోపేననీ, రాజు కావాలని అన్న మాటలు కావని నిర్ధారించుకున్న మంగళకు ఒక్కసారి ఏడుపొచ్చినంత పనయింది చివరికి రంగనాధం పన్నిన ఉచ్చులో తనుకూడా పడిందన్నమాట! ఆమాత్రం గ్రహించుకోలేకపోయిన తన తెలివితక్కువే రాజుకు, తనకూ మధ్య అగాథం సృష్టించిందని విరమాలుకుంటూ, రాజు ప్రేమను శంకించినందుకు పరితపిస్తూంది కాని, మంగళకిప్పుడు రాజు అన్న మాటలకంటే, మాటామంతీ లేకుండా ఊరొదిలిపోవడం ఘోరావమానంగా ఉంది ఇన్ని సంవత్సరాల తర్వాత తన తాత తనను వెతుక్కుంటూ వస్తున్నాడన్న లేశమాత్రపు ఆనందాన్ని కూడా పొందలేక పోతోందామె మనసు



దిగులుగా ఎటో చూస్తున్న మంగళ భుజం మీద అనునయంగా చేతులేసింది వసుమతి. "ఎందుకు మంగళా అలా ఉన్నావ్? రాజు అలా అన్నాడనా? లేక ఇంతోటి గొప్పవాడు మళ్ళీ నీకు దొరకదనా?" అంటూ

"హుఁ! ఇంతమాత్రానికే ఊరొదిలి పారిపోయేంత పిరికివాడికోసం నే దిగులు పడతానా?" అసలు దిగులుకి కారణం అదే కావటం చేత ఎంత బింకంగా చెప్పబోయినా, మాటల్లో ఉన్న బిరుసుదనం కంఠంలో వినపడలేదు. అంచేత వసుమతి కూడా బాగా మెత్తబడిపోయింది. పైకి బిగువు నటిస్తున్నా, మంగళ లోలోపల ఎందుకో బాధపడుతూందనిపించింది.

"అయినా, ఇలాంటివాళ్ళని ప్రేమించ కూడదే!" అంది ఓదార్పుగా 'తనేదో ప్రాకులాడుతూంటే రాజే తృణీకరించినట్టు వసుమతి నిర్ధారిస్తోందన్న మాట వసుమతి!' జరగరాని పరాభవం పొందీ, ఓడిపోయావని జాలిపడుతూన్నట్టు తోచి, పౌరుషం అణువణువునా తన్నుకొస్తూంటే చర్రుమంది మంగళ

"ప్రేమేమిటి? ప్రేమ! ఈ ప్రేమా, దోమా నాకేం తెలియవు నేనేం మీలా టస్ట్రీల్లో చదువులు వెలిగించలేదు—ప్రేమా—గాడిద గుడ్డూ—అంటూ పిచ్చి కబుర్లు చెప్పడానికి—తెలిసిందా?" గట్టిగా కసరడంతో నోట మాట రాలేదిక వసుమతికి. అంతటితో మంగ శెందువలనో మారిపోయిందని నిశ్చయించుకోక తప్పలేదు.

గడచిన జీవిత మొక కలగా తోస్తుంది మంగళకు. 'ఎంతలో ఎంత మార్పు—మనుషులు అనుకునే వేమిటి? చివరకు జరిగేవేమిటి? జీవితాలెంత విచిత్రంగా ఉంటాయి నిన్నటివరకు తను దిక్కూలేనిది—నిర్ధనురాలు—కాని, అప్పటి ఆశలు వేరు—ఆ కలలు వేరు—వాటివలన లభించే సంతృప్తే వేరు. ఈనాడు—తన తల్లిదండ్రులెవరో తెలిపింది. తన నెంతో ప్రేమగా, అపురూపంగా చూసుకునే తాతయ్య ఉన్నాడని తెలిసింది—తరగని సిరిసంపదలున్నాయని తెలిసింది—కాని, ఏకోశానా సంతోషం కలగటంలేదు—జీవితమే ఇంత కాబోలు!' అదోరకమైన వేదాంత ధోరణి నలవరచుకుంది మంగళ.

* * *

తాతగారితో వెళ్ళమని చౌదరి చెప్పినప్పుడు మౌనంగా ఊరుకుంది మంగళ. ఇదే మరొకప్పుడైతే తాతకాదు, బ్రహ్మదేముడు దిగొచ్చినాసరే కాలు కదిపి ఉండేది కాదు—మౌనం అర్ధాంగీకారంగా ప్రయాణసన్నాహాలు ప్రారంభమయాయి.

శుక్రవారం రానే వచ్చింది. రంగారావుగారి ఆగమనం కోసం ఓ ప్రక్కనుండి ఎదురుచూస్తూనే మరోప్రక్క మంగళ ఇక వెళ్ళిపోతుందని కించపడుతున్నాడు చౌదరి ఆడపిల్ల అత్తవారింటికి వెళిపోతూంటే తండ్రి పడే బాధని మించిపోయిందతని బాధ. కాని పైకేమాత్రమూ బయటపడకుండా గంభీరత నిలుపుకుంటున్నాడు

ఆ రోజు పది గంటలవేళ చౌదరి

గారింటి ముందు వచ్చి ఆగిన కారులోంచి దిగే వ్యక్తి కోసం ఎన్నో జతల కళ్లు కాచుకున్నాయి ఎత్తైన దృఢ విగ్రహం, పూర్తిగా నెరిసి వంకీలు తిరిగిన ఒత్తైన జుట్టు, నలుపు తెలుపుల బుంగమీసాలు, తెల్లని జరీ ధోవతిపై పట్టు చొక్కామీద రాజస మొలికించే కండువా జరీని వెక్కిరిస్తూ సన్నని బంగారు గొలుసు, చేతిలో కళా కేశలాన్ని చాటే లతలు చెక్కిన చేతి కర్రతో కారు దిగిన రంగారావు గారు అందరి కళ్ళనూ ఓ ముసలి మహారాజులా కన్పించేవారే-కళ్లల్లో ఆ దైన్యం లేకుంటే.

చౌదరి ఎదురు వెళ్ళి సాదరంగా ఆయనకు స్వాగతం చెప్తూంటే స్నేహంగా, కృతజ్ఞతగా చౌదరి రెండు చేతులూ పట్టుకున్నా డాయన పరస్పర పరిచయాలయ్యాక రంగారావుగారు తన వెంట నున్న యువకుడిని పరిచయం చేశారు. ఇతను కృష్ణ-ఇంజనీరు. కృష్ణ ఇంజనీరయ్యాక మా ఫ్యాక్టరీ ఎంతో బాగు పడింది చాలా తెలివైనవాడు" అంటూంటే నమ్రతగా తల వంచి నమస్కరించా డతను.

లోపలి నుంచి వీరిని గమనిస్తున్న వసుమతి "మరేం?" అంటూ హుషారుగా భుజాలెగరేసి మంగళకేసి చూసి అర్థవంతంగా నవ్వింది మతి పోయినట్టు చూస్తూన్న మంగళకి వసుమతి అన్న 'మరేం?' లోని మర్మార్థాలు అవగాహన కాలేదు "రాజు చిల్లి గవ్వకి కొరగాడితని ముందు'" అని కూడా వసుమతి రెట్టించడంతో మంగళ హృదయం చివుక్కుమంది.

చౌదరి వచ్చినవారిని గౌరవంగా తీసుకున వచ్చి హాల్లో కూఛోపెట్టి వసుమతిని కేకేశాడు. తాతయ్య కళ్ళు మనుమరాలి కోసం ఆత్రంగా ప్రతి ద్వారంకేసి చూస్తూన్నాయి.

ఈవాళ మంగళ రూపం పూర్తిగా మార్చేసింది వసుమతి. కొత్త అవతారంలో ఇమడలేకపోతున్న మంగళ కొత్త వ్యక్తుల ముందుకి రాగానే మరీ బెరుగ్గా తయారయింది.

మంగళను చూడగానే సంతోషమూ, దుఃఖమూ పెనవేసుకుపోయి కళ్ళు అశ్రుపూరితాలై, కంఠం గద్గదమౌతూంటే "రా తల్లీ'" అన్నాడు రంగారావుగారు.

"వెళ్ళవే, వెళ్ళు తాతగారికి నమస్కారం చెయ్యి" అంటున్నాడు చౌదరి తాతకు లేని చనువుతో

మంగళ జంకుగా చూస్తూంది. వీళ్ళెవరో చాలా గొప్పవాళ్లలా ఉన్నారు. వాళ్ళ మర్యాద లేమిటో తనకు తెలియవు. ఏం మాట్లాడితే ఏమనుకుంటారో! బెంగగా ఉంది. నటన ఏమాత్రమూ రాని వాడిని ఉన్నపాటున చెప్పా చెయ్యకుండా స్టేజి ఎక్కించేసి, బరువైన పాత్రలో నటించమన్నట్లుంది. తన ఎడల అంత ఆపేక్ష, ప్రేమ చూపుతూన్న తాతకు ఎలా ప్రవర్తించి ఆనందం కలిగించాలో తెలియడం లేదు కారణం-మంగళకు మనసు లోంచీ ఎటువంటి స్పందనా కలగటం లేదు. ఏదో నటించవలసి వచ్చినట్టే ఉంది.

బలాత్కారంగా ఎవరో వెనుక నుండి తోస్తున్నట్టే నడచి వస్తూ తాత ముఖం



లోకి తదేకంగా చూసింది. తన తల్లిదండ్రులలా వెళ్ళిపోవడానికి తను దిక్కుమాలిన దానిలా ఇన్నాళ్ళూ బ్రతకటానికి కారణం తనే ననుకుంటే క్షమించమన్న వృద్ధుని సంస్కారం ముందు తల వంచి చేతులు జోడించాలనే అనిపిస్తూంది మునలాయన మీద ఆమెకేమాత్రంఏవగింపు కలగలేదు.

చిన్నవాళ్ళు, ఉడుకు రక్తంతో ఉన్న వాళ్ళు తొందరపాటు పనులు చేసి, ఇబ్బందుల నెదుర్కోడానికి కారణం పూర్తిగా పెద్దలే కాదని గోవిందు విషయంలో బాగానే బోధపడింది. అందుకే తాత మీద మంగళ కదొక రకమయిన జాలి కలుగుతోంది. జరిగినదానికి ఎవరిని నిందించీ ప్రయోజనం లేదు. తప్పంతా అతని మీదికే తోసేసినా కూడా, ఒంటరిగా ఇన్నాళ్ళూ అతననుభవించిన మానసికావేదనకంటే శిక్షే ముంటుంది? ఇప్పుడయినా తన శాయశక్తులా ప్రయత్నించి, అతనికి సంతోషం కలిగించేలా మసలుకొని, తల్లి ఎడబాటు వలన కలిగిన దుఃఖాన్ని పారద్రోలాలని ఉంది. మన సేమో తహ తహలాడుతూంది కాని, భౌతికంగా మంగళలో ఎటువంటి చైతన్యమూ రాలేదు.

కాని రంగారావు ఏదో ఏదో మాట్లాడుతూ మధ్యలో 'చదువు' అన్న ముక్క అనేసరికి మాత్రం భయం పట్టుకుంది.

"ఏం చదువుతున్నావమ్మా?" వసుమతి నడుగుతున్నా డతను.

"ఎమ్. ఏ ఫైనలండీ'' దర్జాగా చెపుతూంది వసుమతి.

"నువ్వేం చదివావమ్మా?" ఇనుమడించిన ఆప్యాయతతో అలా అడుగుతూంటే చదువు అబ్బనందుకు మొదటిసారిగా కించిత్ బాధ కలిగింది మంగళకు. అల్లరి చిల్లరగా తిరగవద్దని చక్కగా వసుమతిలా చదువుకోమని చౌదరి చెవి నిల్లు కట్టుకు పోరితే వినేది కాదు తను; చదువంటే ప్రాణమిచ్చే ఆ తల్లికి ఇలాంటి కూతురు పుట్టిందని తాత బాధపడతారని పించింది. అయినా చెప్పక తప్పదు.

నసుగుతూ నంగిగా అంది: "ఆరు చదివేను ఆ తరువాత మరేమో ఎంచేతో వీలు కాలేదు. నీకే వీలుంటే సంవత్సరానికి రెండు క్లాసులు చదివే దానివే! అయినా నీకు చదువెందుకు పోనిస్తూ! అనేవారు మా మీసాలప్పయ్య మాస్టారు" కొద్దిగా ధైర్యం తెచ్చుకుంది మంగళ.

"అది నిజమేలెండి! దాని తెలివితేటల ముందు ఈ చదువుకున్నవాళ్ళెందుకూ పనికి రారు,అయినా దానికి ఎన్ని రాచకార్యాలనీ! మావసూ చెప్పినట్టు,ప్రైమినిస్టరయ్యే తెలివితేటలున్నాయి, చదువుదేముందిలెండి!" అని నీరసంగా చూస్తున్న ముసలాయన్ని ఓదార్చే ప్రయత్నం చేసాడు చౌదరి.

మనుమరాలిని చూసి కడుపు నింపుకున్న రంగారావుకి ఆ క్షణంలో ఆకలినీ, దాహాన్నీ మించిన విచిత్రమైన బాధేదో కలిగింది.

ఆ రోజే మంగళ పాలెం విడిచి మొదటిసారిగా వెళుతూంది వెళ్ళాలని పించకున్నా వెళ్తూంది. తప్పక వెళ్తూంది. అయినా ఏ చివరి క్షణంలోనయినా రాజు




మనసు మార్చుకొని తిరిగి వస్తాడని, రాజు వచ్చేస్తే తనకిక కాలు కదపవలసిన అవసరమే ఉండదని రవంత ఆశతో ఎదురు చూస్తూనే ఉంది. కాని ఆమె ఆశ నిరాశే అయింది.

కన్నతల్లివంటి ఉన్న ఊరిని వదిలి, బండబారిన హృదయంతో అందరివద్ద వీడ్కోలు పుచ్చుకుంది మంగళ. కారు పొలిమేరలు దాటుతూంది. రాజు ఏ మూల నుండో పరితప్త హృదయంతో తనను చూస్తున్నాడన్న భ్రాంతి వదలక కళ్ళింత చేసుకుని చూసింది మంగళ, తన నెవరూ కనిపెట్టకుండా జాగ్రత్తపడుతూ

## 20

నగరప్రవేశం చేసిన మంగళ పరిస్థితి ఒడ్డున పడేసిన చేపపిల్లలా ఉంది. మనుష్యులు కొత్త, ఆప్యాయతలు కొత్త, పరిసరాలు కొత్త జీవనపంథా అంతా కొత్త. పాలెంలో అయితే తనకు తెలియని మనిషంటూ ఉండేవారు కాదు. ఇక్కడందరూ తనని జంతువులా వింతగా చూస్తారు.

తమ హోదాకు తగ్గట్లు ఎలా ఉండాలో తాతగారు ఎంతో ప్రేమగా బోధపరుస్తూంటారు. అతని ఆప్యాయత మనసుకి హాయనిపించినా, ఆ బోధల నాచరణలో పెట్టాలంటేనే మంగళకు జబ్బుచేసినట్లుండేది. ఖరీదైన నగలు, బట్టలు, వినోదాలు,వింతలు-ఎన్నడూ ఎరగని గారాబం కాఫీతాగిన కప్పయినా కడగనివ్వకుండా నౌకర్లు!

ఇవా తను కోరుకున్నది? ఇవా చివరకు తనకు మిగిలినవి! ఒక్కొక్కసారి ఒంటరిగా మిగిలితే ఏడుపు తన్నుకొచ్చేది మంగళకు. కాని, వీలయినంతవరకు, రంగారావు కాని, కృష్ణ కాని మంగళను ఒంటరిగా వదిలేవారు కాదు

ఒక్కోసారి, అర్ధరాత్రి అందరూ నిద్రిస్తూన్న సమయంలో చెప్పాచెయ్యకుండా పాలెం పారిపోవాలనే తలంపు కలిగేది మంగళకు కాని నిద్రిస్తూన్న ముసలాయన ముఖం చూస్తే చెప్పరాని జాలి వేసేది. తనవలన ఎవరికీ సంతోషం



లేదు, తనకూలేదు. పోనీ, ఆయన ఆనందం కోస మైనా తానక్కడే ఉండాలి అనిపించాక పారిపోవా లన్నది ద్రోహ చింతనగా తోచి లెంపలేసుకునేది.

ఎక్కడ తిరుగుతున్నా, ఏం చేస్తున్నా ఉదయం, సాయంకాలం అలవాటైన వేళకి మాత్రం 'అంబా' అంటూ ఆవు తన కోసం మోరచాచి వెతుక్కుంటున్నట్టు అన్పించి విలవిల్లాడిపోయేది అదిప్పుడు తనకు పాలెంలో ఏకైక ప్రతినిధి! రాజె ప్పుడో ఒకప్పుడు తిరిగి ఇంటికి వెళ్తాడు. కనీసం దాన్ని చూడగానే నైనా తను గుర్తుకి రాక తప్పదు — 'అంబా, అంబా' అంటూ గోలచేసేదాన్ని చూసాకయినా తను లేకుండా అతనుండలేడని గ్రహి స్తాడు తనకోసం వెతుక్కుంటూ ఓనాడు తప్పక వచ్చి తీరుతాడు ఆరోజు—ఆ రోజు తనకు పండుగరోజు—అవును తనకు తానుగా వెళ్తేనే చులకన—రాజే తనదగ్గరకు రావాలి — 'నువ్వు లేకుండా నేనుండలేను' అని అతని నోట వినాలి. అప్పు డతని వెంట వెళ్ళటంలో యెంత ఆనందం' స్వప్నాలు కంటూ, తనలో తనే మురిసిపోయే దప్పుడప్పుడు మంగళ

తాతగారు, కృష్ణతో ముక్తసరిగా మాట్లాడే మంగళ, వాళ్ళు లేని టైము చూసుకుని నౌకర్లతో పాలెం కబుర్లు చెప్పుకుంటూ సంతృప్తిపడేది.

* * *

ఓరోజు కృష్ణ తీరికగా వచ్చి కూచుని "మంగళా! నీకో చిన్నమాట చెప్పాలి!" అన్నాడు.

ఎందుకో భయపడుతూనే "చెప్పు!" అంది మంగళ.

"నువ్వు పనివాళ్ళతో అంతంతసేపు సంభాషించకూడదు వాళ్ళకి అలుసెక్కు వవుతుంది'"

రోషంగా చూపింది మంగళ. కాని కృష్ణ ఆమాట చెప్పిన తీరు దర్పంగా గాని, ఆజ్ఞాపిస్తున్నట్లుగా గాని లేక అర్థిం పుగా ఉంది. అంచేత వెంటనే తమా యించుకుంది.

"ఏం చెయ్యమంటావు చెప్పు కృష్ణా! నేను పల్లెటూరి దాన్ని అలాంటి జనుల మధ్యనే పుట్టి పెరిగినదాన్ని. ఈ బస్తీలో మీలాంటి వాళ్ళతో నేనేమి సంభాషించ గలను? నిజం చెప్తున్నా విను! వాళ్ళే నాకు దగ్గర వాళ్ళుగా తోస్తారు-అంతే" అంది మెత్తగా.

ఆ మాటతో అతని హృదయం తడిసి నట్లయింది.

"నేనూ అలాంటి వాతావరణం నుండి ఇక్కడకు వచ్చినవాడినే మంగళా! అతి బీదకుటుంబంలో తిండికీ, బట్టకూ కూడా కట కటలాడినవాడినే బాబుగారి దయ వల్ల ఈనాడీ స్థితిలో ఉన్నానంతే! నవ నాగరికంగా, అతి గారాబంగా ఉండవలసిన నువ్వు అలాంటి వాతావరణంలో పెరి గావు నీ మనసిప్పుడెలా ఉంటుందో నే నర్థం చేసుకోగలను కాని, చూడు! మన పరిసరాలకు తగ్గట్లు మనం మసలుకోవాలి. కొన్ని కొత్త అలవాట్లు ఇష్టం లేకున్నా చేసుకోక తప్పదు. లేకుంటే 'అనాగరికు లని' ఇలాంటి చోట అంతా వెక్కిరి స్తారు ముఖ్యంగా నిన్నలా ఎవరయినా అనుకుంటే బాబుగారు చాలా బాధ పడ తారు" అని కాస్త ఆగేడు. ఆ మాటలతో కృష్ణ మంగళకు చాలా ఆత్మీయుడయ్యాడు.

(సశేషం)




బస్సు కుదుపులేకుండా నెమ్మదిగా సాగి పోతోంది. చల్లటి గాలి వీస్తోంది కిటికీకి దగ్గరగా కూర్చున్నాను రోడ్డు పక్కనే చెట్లు, పంట కాలువా, పొలాలు సుందరంగా కనిపిస్తున్నాయి నా పక్క సీట్లోనే సుందరి కూర్చుంది అది చిన్న సూట్ కేస్ ఒళ్ళో పెట్టుకుని నిద్రతో తూగుతోంది. ఒకసారి దానివేపు చూశాను. దాని ముఖం అమాయకంగా ఉంది. నాకు కడుపులో బాధ అనిపించింది. ఆరు నెలల్లో తారుమారైన దాని జీవితం తలుచుకుంటే గుండె చెరువైంది.

సుందరి మా పిన్నికూతురు. మా పిన్నికి ఒక్కత్తే కూతురు. దానికి తరువాత ఒక మగపిల్లవాడు వాడికి మనసు ఎదగలేదు. అమాయకుడు. చదువు రాలేదు మా బాబాయికి ఉద్యోగం ఏమీ లేదు బి ఏ, దాకా చదివాడు. కాని ఊరి కేనే ఉన్నాడు పిత్రార్జితం కొంత ఆస్తి ఉంది. దానితోనే కాలక్షేపం చేస్తున్నాడు ఇద్దరే పిల్లలు కాబట్టి ఇబ్బంది లేకుండానే గడచిపోతోంది. సుందరి సన్నగా తెల్లగా బొమ్మలా ఉంటుంది. దాన్ని స్కూల్ ఫైనల్‌వరకు చదివించారు. తరువాత పెళ్ళి చెయ్యాలన్న ఉద్దేశంతో చదువు మానిపించారు అప్పటినుంచి వరాన్వేషణ ప్రారంభమైంది. ఒక్కత్తే కూతురు కావటంతో కొంత ఆస్తి అమ్మైనా మంచి కట్నం ఇచ్చి మంచి సంబంధం తేవాలన్న ఉద్దేశంతో మంచి సంబంధాలే వెతికారు కాని ఒక్క సంబంధమూ సరిగా కుదరలేదు. అవతలివాళ్ళకు నచ్చితే వీళ్ళకు నచ్చదు వీళ్ళకు నచ్చితే అవతలివాళ్ళకు నచ్చదు. ఒక్కత్తే కూతురు కావడంతో చాల మంచి సంబంధం తేవాలన్న ఆశతో మా బాబాయి ఏ సంబంధానికి సులభంగా ఒప్పుకోలేదు. అలాగే రోజులు గడిచిపోయాయి. సంవత్సరాలు దాటి వెళ్ళాయి. సుందరి పదహారేళ్ళ వయస్సునుంచి ముప్పైఏళ్ళ వయస్సుకు పెరిగింది.

అప్పుడు మా బాబాయికి గాబరాపట్టుకుంది. ఎల్లాగైనా దీనికి పెళ్ళి చేయగలుగుతానా, దీనికి కన్నెచెర విడిపించగలనా అని దిగులు పట్టుకుంది. ఎటువంటి సంబంధము నచ్చనివాడు చివరకు ఏ సంబంధమైనా సరే, ఎవరైనాసరే అసలు పెళ్ళంటూ జరిగితే చాలు అన్న హీనస్థితికి దిగ జారాడు. అటువంటి పరిస్థితిలో మా మేనత్త ఒక సంబంధం పట్టుకు వచ్చింది. పిల్లవాడికి దగ్గర దగ్గర నలభై ఏళ్ళు న్నాయి. రెండవ పెళ్ళి. మొదటి భార్య చనిపోయింది. కాని పెద్ద ఉద్యోగంలో ఉన్నాడు. ఆస్తిపాస్తులేమీ లేవు. ఇదీ సంబంధం. ఇది మా బాబాయికి నచ్చింది. పిల్లకు ముప్పై ఏళ్ళు. మొదటి పెళ్ళివాడు కుదరటం కష్టమే. రెండో పెళ్ళివాడైనా మంచి ఉద్యోగంలో ఉన్నాడు. మంచి సంబంధమే అనుకున్నాడు ఈ పెళ్ళివారు కూడా రెండో పెళ్ళి అయినా కట్నాలు కానుకలు బాగానే అడిగారు. పాతికవేలు కట్నం ఇమ్మన్నారు. పెళ్ళి ఘనంగా జరపమన్నారు. మా బాబాయి అన్నింటికి ఒప్పుకున్నాడు. ఆయనకు ఒక్క కూతురు గదా! ఘనంగానే చెయ్యాలని ఉంది. సగం ఆస్తి అమ్మాడు అడిగిన కట్నం ఇచ్చాడు. అవతల భార్య, అసమర్థుడైన కొడుకు ఉన్నారు అని కూడా ఆలోచించ లేదు. ఈ పిల్ల పెళ్ళైతే చాలు అను కున్నాడు పెళ్ళి ఘనంగా జరిపాడు. ఏభై వేల ఖర్చుతో అప్పులు మాత్రం లేకుండా బయటపడ్డాడు. సుందరికి కన్నెచెర వది లింది.

పెళ్ళిలోనే అక్కడా అక్కడా గుస గుసలు బయలుదేరాయి. పెళ్ళికొడుక్కు ఉండవలసిన అవలక్షణాలన్నీ ఉన్నాయి. వచ్చే సంపాదన అంతా తాగుడుకు సరిపో తుంది మొదటి భార్య ఇతనితో వేగలేక బాధలుపడలేక ఆత్మహత్య చేసుకుంది. అప్పటినుంచి మళ్ళా ఇప్పటివరకు ఎవరూ పిల్లనిస్తామని ముందుకు రాలేదు. ఇన్నా ళ్ళకి వీళ్ళు పాపం తెలియక గోతిలో దిగుతున్నారు. పెళ్ళికి వచ్చిన చుట్టాలు స్నేహితులు గుసగుసలు చాటుచాటుగా చెప్పుకున్నారు. ఇదంతా విన్న నేను బాధ భరించలేక ముహూర్తానికి ముందే పెళ్ళి మా బాబాయితో చెప్పాను. ఈ పెళ్ళి ఎలాగైనా ఆపుచెయ్యమని ఆయన వినిపించుకోలేదు "ఆ. కాని వాళ్ళు అసూయతో ఏదో అంటూనే ఉంటారు." అని తోసిపారేశారు. పెళ్ళి యథావిధిగా జరిగిపోయింది.

సుందరికి మొదటిరాత్రి శోభనపు గదిలోనే తెలిసిపోయింది. పెళ్ళికొడుకు తప్పతాగి వచ్చాడు అని. అయినా ఏం చేస్తుంది? అతను పెట్టే చిత్రవధ అనుభ వించక తప్పలేదు పరాయి వెధవ తాగి వచ్చి తాకడానికి ప్రయత్నిస్తే తిట్టి పోస్తాము తన్ని తరిమేస్తాము. కాని ఏభై వేలు పోసి కొనుక్కున్న భర్త ఏం చెయ్యడానికి వీలులేదు తాళిగట్టిన భర్త తాగివచ్చినా కౌగిలించుకోక తప్పదు. మనసులో వెగటు మనసులోనే దాచుకుని.

కాపురానికి వెళ్ళిన రెండునెలల్లోనే సుందరికి మొదటిభార్య ఆత్మహత్య చేసు కున్నమాట నిజమే అయి ఉంటుందని, అందులో అసత్యమేమీ ఉండదని తెలిసి









పోయింది. రానురాను సుందరికి కాపరం నరకం అయింది. సంపాదన చాలక పుట్టింటినించి మళ్ళీ మళ్ళీ డబ్బు తీసుకు రమ్మన్న సాధింపులు బాధలు ఎక్కువైనాయి ఇవన్నీ తట్టుకోలేక ఒకరోజు మళ్ళా మా ఊరు చేరుకుంది. అతను మనిషి మారితేనేగాని మళ్ళా వెళ్ళనని కూచుంది. దాన్ని బలవంతంగా పంపటానికి ఎవరికీ మనసు రాలేదు. ఇది వచ్చేసిన తరువాత అతను మళ్లా దీని విషయం పట్టించుకోలేదు. ఉత్తరాలు లేవు. మనిషి రాలేదు.

దీని కాపురం ఇలా అయినందుకు మా బాబాయి మంచం పట్టాడు. ఈ పెళ్ళి కోసం ఉన్న ఆస్తి మూడువంతులు తరిగిపోయింది. కొడుకు సంపాయించలేడు. తనకు వయసు పెరుగుతోంది. ఈ దిగులుతో ఆయన మళ్ళా కోలుకునే సూచనలు కనిపించలేదు. మా పిన్ని, సుందరి కూడా కూడా దిగులుతో జీవచ్ఛవాలులా బ్రతుకుతున్నారు. సుందరికి మా బాబాయి తాపత్రయంవల్ల కన్నెచెర వదిలింది కాని బ్రతికి నన్నాళ్ళు భరించవలసిన మరొక చెర తగుల్కొంది పెళ్ళి కాకపోతే ఏమి: దాన్ని చదివించి ఉద్యోగంలో పెట్టి ఉండవచ్చును. సగం ఆస్తి ఇచ్చి ఉండవచ్చును. ఇప్పుడు ఈ పెళ్ళివలన ఏం సుఖపడుతోంది, అని ఎన్నో సార్లు అనిపిస్తుంది. కాని ఏం చేస్తాం! దానికి పెళ్ళి అయ్యేవరకు మా బాబాయికి మనశ్శాంతి లేదు ఇప్పుడు మరొక రకంగా మనశ్శాంతి లేదు.

బస్సు ఒక మూలగా ఆగింది. ఏవో బ్రేకులు బాగులేవట. డ్రైవరు కండక్టరు దిగి చూసుకుంటున్నారు. ప్రొద్దు వాలింది. చెట్లక్రింద నీడలు వ్యాపిస్తున్నాయి.

సుందరిని నాతో మద్రాసు తీసుకువెళు తున్నాను అక్కడ దాన్ని మాంటిసోరి ట్రైనింగులో చేర్పించి తరువాత దాని కెక్కడైనా స్కూల్లో ఉద్యోగం సంపాదించిపెట్టాలని నా ఆలోచన. సంపాదన కోసం కాకపోయినా, దానికొక కాలక్షేపం ఉంటుందని.

"అక్కా, నాకు ఉద్యోగం దొరుకుతుందంటావా?" అంది సుందరి హఠాత్తుగా, నా ఆలోచనలను ఊహిస్తున్నట్లుగా!

"ఎందుకు దొరకదు? తప్పకుండా దొరుకుతుంది" అన్నాను నేను ధైర్యంగా.

సుందరి నిర్లిప్తంగా దిక్కులు చూస్తూ ఊరుకుంది. దాని కళ్ళలో దిగులు తాండవిస్తోంది. ఏదో అంతులేని అగాధం గూడు కట్టుకుంది.

సుందరికి నేను చాలా శ్రమపడి ఉద్యోగం సంపాదించి పెట్టగలనేమో! మరి మళ్ళా ఆ కళ్ళల్లోకి వికాసం ఎలా తేగలను? ఆమె శాశ్వతంగా చిక్కుకున్న చెరలోంచి ఎలా విడిపించగలను? ఆ కాపురం చేసిన రెండు నెలల్లోనే ఆమె భర్తమీద మమకారం పెంచుకుందేమో! ఆ గుండెల్లో వేదన ఎలా తొలగించగలను?

ఈ ప్రశ్నలకు సమాధానం తోచటం లేదు. సుందరి నిర్జీవ ప్రతిమలా ఉంది.



# వలయం

పాతికేళ్లు దాటినా నీలవేణి కింకా పెళ్ళి కాలేదు. ఆమె అనాకారి కూడా కాదు. మరీ సౌందర్యవతి కాదుగాని ఫరవాలేదని పించే అందం ఆమెకి వుండనేవుంది వెను కటికో సుప్రసిద్ధ రచయిత్రి నవల్లోనిహీరో యిన్లా "నేను మగాణ్ణి పెళ్ళి ఆడనుగాక ఆడను" అంటూ నీలవేణి ప్రతిజ్ఞ ఏమైనా తీసుకుందా అంటే అదేమీ కాదు. పద్దెని మిదోయేడు ప్రవేశించినప్పట్నించీ అంద రాడపిల్లలకిమల్లే ఆమెకీ పెళ్ళి చేసుకోవా లనే కోరిక వుంది. మరయితే నీలవేణి ఇంకా అవివాహితగానే వుండిపోడానికిగల కారణం ఏమిటంటే—మొగుణ్ణి కూడా డబ్బిచ్చి కొనుక్కునే గ్రహచారం దయ్యంలా పట్టి పీడించే ఈ దేశంలో ఒకానొక నడి తరగతి సంసారంలో నీల వేణి ఆడదై పుట్టడం మాత్రమే.

మామూలు గుమాస్తాగా ప్రారంభించి యు డి సి గా మాత్రమే తండ్రి రిటైరయ్యే నాటికి నీలవేణికి సరిగ్గా పద్దెనిమిదేళ్ళు. ఆర్థిక ఇబ్బందులవల్ల ఆదర్శాలే వంట బట్టాయో, ఆదర్శాల పుణ్యమా అని ఆర్థిక ఇబ్బందులే ఎదురయ్యాయో తెలీదుగాని లోకనాధంగారు విశ్రాంతి తీసుకునేనాటికి అతని ఆశయాలు రెండు మాత్రం నెర వేరాయి. తను గృహస్థాశ్రమం స్వీక రించినప్పటినుంచి చేస్తూ-తీరుస్తూ మళ్ళీ చేస్తూ సేకరించిన ఋణ సముదాయాన్ని వడ్డీతో తీర్చి పారేయగలిగేడు వాళ్ళనీ వీళ్ళనీ బతిమాలి బి. ఎ. పాసయిన కొడుక్కి పట్నంలో ఓ గుమాస్తా వుద్యోగం వేయించగలిగేడు ఇకపోతే కూతురికీ కొడుక్కీ కట్నం లేకుండా పెళ్ళిళ్ళు చెయ్యటమన్నదే ఇప్పుడాయనకి మిగిలివున్న ఒకే ఆశయం, ఆదర్శమూను కాని ఈ ఆదర్శానికీ, తన చేతిలో చిల్లి గవ్వ లేకపోవటానికి చాలా సన్నిహిత సంబంధం వున్నదన్న సంగతి బహిరం గంగా ఒప్పుకోవటం మాత్రం లోకనాధం గారికి సుతరామూ ఇష్టంలేదు.

తనకీ జన్మలో ఇహ పెళ్ళయ్యే రాత లేదనే నిర్ణయానికి చాలా రోజుల క్రితమే వచ్చేసింది నీలవేణి.

అన్న నిరంజనరావు నెల నెలా పంపించే డబ్బుతో మూడు పూటలూ తండ్రికి వండిపెడుతూ, కోరికల్ని చంపు కుని, ఒంటరిగా గడపటం దుర్భరంగా తోచింది నీలవేణికి. చదువు మానేస్తే పెళ్ళి చేసుకోవచ్చుననే ఆశతో స్కూల్ ఫైనల్ పూర్తి చెయ్యకుండానే చదువుకి స్వస్తి చెప్పేసింది కాని రెంటికీ చెడిన రేవడిలా తయారైంది బ్రతుకు

ఇంకా చదువుకుని తనూ ఓ వుద్యోగం చూసుకుని వుంటే ఈ బందిఖానాలాంటి జీవితం తప్పిపోయేది గదా అనుకుని, అలా చేయని తన మూర్ఖత్వానికి తన్ను తాను నిందించుకుంది.

ఈ కన్నెచెర విడిపించుకుని ఎవరితో

---

జి. మల్లీశ్వరి

నైనా లేచిపోదామనే ఆలోచన కూడా కలగకపోలేదు. నీలవేణికి కాని లేచి పోయిన ఆడపిల్లల జీవితాలన్నీ విషాదాంతాలుగానే చిత్రించే తెలుగు కథల్ని చదివి చదివి ఆ ప్రయత్నం మానుకుంది. సరిగ్గా ఈ సమయంలోనే చీకటి నిండిన ఆమె జీవితంలోకి వెలుగురేఖలా ప్రవేశించాడు అతను.

మూడ్నెల్ల కిందట ఒకనాడు—

"హల్లో! కమలా! కంగ్రాచ్యులేషన్స్" అన్న మాటలు విని తిరిగిచూసింది. నీలవేణి. అప్పుడామె జిల్లా పరిషత్ గ్రంథాలయంలో ఏదో పుస్తకంకోసం వెదుకుతోంది

తిరిగిచూసిందే గాని తను తప్ప అక్కడ మరో ఆడపురుగు ఎవరూ లేక పోయేసరికి "కమలా" అని సంబోధించబడిన వ్యక్తికేసి పరిశీలనగా చూసింది. అతన్నిదివరకు ఎక్కడో చూసినట్టనిపించింది ఆమెకి

చప్పున గుర్తుకి తెచ్చుకుంది, మొన్నీ మధ్య దీపావళి కథల పోటీల్లో ప్రథమ బహుమతి గెల్చుకున్న రచయిత ఫోటోకి, ఇతనికీ చాలా దగ్గరి పోలికలున్నాయని. తనకేసి అలా చూస్తూ నిలబడిన నీలవేణిని చూసి చిన్నగా నవ్వేడు అతను. కొద్దిగా తడబడ్డ నీలవేణి—

"క్షమించండి! మీరు ?" అని వాక్యం పూర్తి చెయ్యకముందే "నా పేరు కమలాకరం" అన్నాడతను.

"మీ పోటీ కథ చదివాను. చాలా బావుంది" అన్నది నీలవేణి కొంచెం సిగ్గుపడి తల వంచుకుని.

"థేంక్స్" అని, అంతలో మరెవరో అతడ్ని పలకరించేసరికి అక్కణ్ణించి కదిలాడు.

వివిధ పత్రికల్లో 'కమల' పేరుతో వచ్చే కథల్ని చాలా చదివింది నీలవేణి. పెళ్ళికాని ఆడపిల్లల జీవితాల్ని, సమస్యలను వివిధ కోణాల్లో, హృదయానికి హత్తుకుపోయేలా చిత్రించే ఆ కథలంటే ఆమెకి చాలా ఇష్టం వరకట్న దురాచారాన్ని కథావస్తువుగా తీసుకుని అతనీ మధ్యే రాసిన ఓ కథ ఆమెకి మరీ బాగా నచ్చింది. ఆ కథలోని మృదులవేణికీ తనకీ చాలా పోలికలున్నాయి కథ చివర్న సూచించిన ఆ పరిష్కారం — ఎంతవరకు ఆచరణ యోగ్యమన్న సంగతి అటుంచి-జీవితంలో ఇలా జరిగితే ఎంత బావుణ్ణనిపించింది నతనికి.

వారం రోజుల తరువాత లైబ్రరీ పుస్తకాన్ని తిరిగిచ్చేసి వస్తుంటే దారిలో అతడు కనిపించి పలకరించాడు.

"హల్లో! నీలవేణిగారూ! బావున్నారా?"

ముందు ఆ సంబోధన విని విస్తుపోయింది నీలవేణి

"ఏంవిటలా చూస్తున్నారు? ఆ రోజు లైబ్రరీలో విజిటర్సు బుక్కులో మీ పేరు చూశాను. లైబ్రరీ నుంచేనా రావటం" అన్నాడు తన చేతిలోని పుస్తకాలను చూస్తూ.

అవునన్నట్లు తల పంకించింది

"కమల పేరుతో కథల్రాసేది ఎవరో పెళ్ళికాని అమ్మాయే నని అనుకునేదాన్ని. పత్రికలో మీ ఫోటో చూసేదాకా" అంది చిన్నగా నవ్వుతూ.

"ఏం చెయ్యను చెప్పండి. నా అసలు పేరుతో రాస్తే పత్రికల వాళ్లు వేసుకో లేదు మరి" అని నవ్వాడు.

ఆ తరువాత ఏం మాట్లాడాలో తోచ లేదు నీలవేణికి. వచ్చేపోయేవాళ్ళంతా తమ కేసే విడ్డూరంగా చూస్తున్నట్టనిపించింది.

"త్వరగా వెళ్ళాలి. వస్తాను" అనేసి అక్కడ్నుంచి కదిలింది.

మరొకసారి పార్కు దగ్గర కలిసాడు అతను.

"ఈరోజుకూడా త్వరగా వెళ్ళిపోవాలా మీరు?" అన్నాడు నవ్వుతూ. లేదన్నట్టు తలూపింది.

"అయితే పదండి. కాసేపలా పార్కులో కూర్చుని వెడుదురుగాని" అని తన అంగీకారంకోసం ఎదురు చూడ కుండా పార్కులోకి దారితీశాడు కమలా కరం. ఒక్క క్షణం తటపటాయించి అతడ్ననుసరించింది.

పార్కులో ఓ మూలగా చెట్టుకింద పచ్చికలో కూర్చున్నారిద్దరూ.

కాసేపు అతని కథల్ని గురించి అవీ



ఇవీ మాట్లాడాక చటుక్కున అడిగింది నీలవేణి. "మీకు పెళ్ళయిందా?" అని.

కమలాకరం నవ్వి "'లేదు' అంటే మీరు నన్ను పెళ్ళాడేస్తారా?" అని ఎదురు ప్రశ్న వేశాడు.

పచ్చికమీద వేళ్ళతో రాస్తూ రెండు నిమిషాలపాటు మౌనంగా వుండిపోయింది నీలవేణి ఆ తరువాత అతని కళ్ళల్లోకి సూటిగా చూసి "కట్నం ప్రసక్తి లేకుండా నన్ను చేసుకోవటం మీ కిష్టమైతే అందుకు నే నీ క్షణమే సిద్ధంగా వున్నాను" అంది

మొదట ఆమె చొరవకి చకితుడైన కమలాకరం ఆ వెంటనే ఆ మాటల వెనక దాగిన విషాదాన్ని, బాధనీ లీలగా అర్థం చేసుకోగలిగాడు.

"నా కథలన్నీ చదివి నన్నర్థం చేసుకున్నదింతేనా నీలవేణీ?"

మొదటిసారిగా తనలా సంబోధించే సరికి ఆమె హృదయపు లోతుల్లో ఒకింత పులకరింత జనించి కొద్దిక్షణాలు ఆమెను మాట్లాడనీకుండా చేసింది.

"కథల్రాయటం వేరు, వాటిలో పలికించే ఆదర్శాలకు అనుగుణంగా జీవించాలనుకోవటం వేరు కాదా" అంది అతని కేసి చూస్తూ.

"కొందరి విషయంలో గావచ్చు కాని నేనైనంతవరకూ నమ్మిన ఆదర్శాల కనుగుణంగా జీవితాన్ని మలచుకోవాలనే అనుకుంటున్నాను"

"అయితే చెప్పండి. నన్ను పెళ్ళి చేసుకుంటారా?"

గడ్డి పరకను తుంచి మునుపంటితో కొరుకుతూ వుండిపోయాడు కమలాకరం.

"ఏమాలోచిస్తున్నారు? ఏవిటిలా బరితెగించి అడిగేస్తోంది అనా?"

"కాదు మనసులోని మాటను సూటిగా, ధైర్యంగా వ్యక్తంచేసే వాళ్ళంటే నాకెంతో ఇష్టం."

"మరయితే నే నడిగిందానికి సమాధానం చెప్పరేం?"

"మరీ తొందర పెట్టేస్తున్నావు నీలాగే నాకూ పెళ్ళి కావాల్సిన ఓ చెల్లెలుంది దానికి కాకుండా నేను చేసుకోవటం నాకిష్టంలేదు."

నీలవేణిలో అతని మాటలు పరిపరి విధాల ఆలోచనలను రేకెత్తించాయి కాని వాటిని వెంటనే అతని ఎదుట వ్యక్తం చేయటం భావ్యం కాదనుకుంది. వాళ్ళిద్దరి మధ్యా కొన్ని నిమిషాలు మౌనంగానే దొర్లిపోయాయి చీకటి పడింది. ఇద్దరూ పార్కులోంచి లేచారు

ఆ రాత్రి నీలవేణి చాలాసేపటిదాకా ఆలోచిస్తూనే వుంది. తనకు కమలాకరంతో వివాహం జరగాలంటే ముందుగా అతని చెల్లెలికి పెళ్ళి కావాలి తనలాగే ఆ అమ్మాయికీ కట్నం తీసుకోకుండా పెళ్లాడ్డానికి సిద్ధపడే వరుడు దొరికి వుండడు అంతే అయివుంటుంది యవ్వనం వుడిగి పోతున్నా కట్నా లిచ్చుకోలేక అవివాహితులుగానే మిగిలిపోతూన్న అబలలు ఎంత మంది లేరీ దేశంలో.

కమలాకరంలాగే తన అన్నయ్య కూడా ముప్ఫయి దాటినా ఇంకా పెళ్ళి చేసుకోలేదు.

కమలాకరం చెల్లెల్ని అన్నయ్య చేసుకుంటే?




ఈ ఆలోచన పార్కులో వున్నప్పుడే తనకు తట్టింది కాని ఎంచేతో వెంటనే కమలాకరంతో ఈ మాట అనలేక పోయింది ఈసారి కలుసుకున్నప్పుడు తప్పకుండా ఈ విషయం మాట్లాడాలి తమలో ఎవరికీ కట్నాలు తీసుకునే వుద్దేశం లేదు కమలాకరం చెల్లెల్ని అన్నయ్య చేసుకుంటే, తనకీ కమలాకరానికీ పెళ్ళవుతుంది రెండు పెళ్ళిళ్ళూ ఒకే ముహూర్తంలో,జరిగిపోగలవు అన్నయ్యక్కూడా వుత్తరం రాసి, ఇక్కడికి రప్పించి అన్ని విషయాలూ మాట్లాడాలి ఇలా ఆలోచిస్తూ అర్ధరాత్రి దాటిం తర్వాత నిద్రలోకి జారుకుంది నీలవేణి.

తెల్లవారింది ఎప్పుడెప్పుడు సాయంకాల మౌతుందా, కమలాకరాన్ని కలుసుకుని అతనితో తన ఆలోచనలు పంచుకుందామా అని ఆమె మనసు వురకలు వేసింది. సాయంత్రం అయిదుగంట లవుతూండగా లైబ్రరీకి చేరుకుంది ఆరు గంటలు దాటినా అతని జాడలేదు. లైబ్రరీ మూసే వేళ కూడా అయిపోయింది. నిరాశతో ఇంటికి తిరిగివచ్చింది నీలవేణి. ఇలా వరుసగా మూడురోజులూ నిరాసే ఎదురైంది ఆమెకి నాలుగోనాడు ఇక వుండబట్టలేక లైబ్రేరియన్ని అడిగింది— కమలాకరాన్ని

"హల్లో కమలా" అని పలకరించే టంతట చనువున్న మిత్రుడు ఆ గ్రంథాలయంలో అతనొక్కడే గనక.

"అరె! మీకు తెలీదేవిఁటి! కమల వాళ్ళ వూరెళ్ళి నాలుగు రోజులైంది.

ఏదో అర్జంటు పనిమీద బయలుదేరుతున్నా నని చెప్పి వెళ్ళాడు" అన్నాడు.

ఊరికి వెళ్ళిన కమలాకరం మళ్ళీ పది రోజులకిగాని తిరిగి రాలేదు అతన్ని కలుసుకోవాలనే తహతహతో రోజూ ఎదురుచూసింది నీలవేణి అందుక్కారణం అన్నయ్య దగ్గర్నుంచివచ్చిన ఆ వుత్తరం

నాన్నగార్కి నమస్కారించి—

క్షేమం అక్కడ మీరూ, చెల్లెలు నీలవేణీ కులాసాయేనని తలుస్తున్నాను. నేను కట్నం తీసుకుని వివాహం చేసు కోవటానికి నిశ్చయించాను. మీ ఆదర్శాన్ని పాటించలేక పోతున్నందుకు క్షంతవ్యుణ్ణి మనిషి మనుగడలోని అన్ని దశలూ డబ్బుతో, లాభాపేక్షతో ముడిపడివున్న ఈ వ్యవస్థలో మనమాశించే మార్పు మీరూ నేనూ మడి గట్టుక్కూర్చున్నంత మాత్రాన రాదు సమాజంలో మౌలికమైన పరిణామం రానిదే ఇలాంటి దురాచారాలను రూపుమాపటం సాధ్యంకాదు. నేను కట్నం పుచ్చుకోవటంవల్ల మరో ముఖ్యమైన ప్రయోజనంకూడా వుంది ఆ డబ్బుతో చెల్లెలిక్కూడా ఓ సంబంధం చూడొచ్చు ఇవన్నీ ఆలోచించిన మీదటే నేనీ నిర్ణయం తీసుకున్నాను. అమ్మాయి ఫోటో చూడ్డం, వాళ్ళ పెద్దవాళ్ళతో మాట్లాడటం కూడా అయిపోయింది. వీలైనంత తొందరలో ముహూర్తం పెట్టుకోవాలని వాళ్ళు తొందరపడుతున్నారు చెల్లెలిక్కూడా సంబంధం కోసం ప్రయత్నిస్తున్నాను. ఈసారి అక్కడికొచ్చినప్పుడు అన్ని వివరాలూ మాట్లాడుకుందాము.

ఇట్లు,
— నిరంజనరావు

వుత్తరం చదువుకున్న నీలవేణి నీరు గారిపోయింది

లోకనాథం మాత్రం ఉలకలేదు పలక లేదు. తండ్రిగా తను వాళ్ళకి పెళ్ళిళ్ళు జరిపించే స్థితిలో లేడు ఆదర్శమో, వల్లకాదో వాళ్ళ జీవితాలకు దారివాళ్ళు వెదుక్కోవటం అతనికి సబబుగానే కనిపించింది

నీలవేణికి మాత్రం తను ఆలోచించి పెట్టుకున్న పథకం పాడైపోతూందేనన్న బాధ కలిగింది అన్నయ్య అలా తొందర పడి వాళ్ళకి మాటియ్యడం ఆమెకేమాత్రమూ నచ్చలేదు ఇప్పటికయినా మించిపోయిందేం లేదు ముహూర్తాలింకా పెట్టుకోలేదు కదా కమలాకరం ఈ రోజైనా వస్తే అతనితో మాట్లాడి వెంటనే అన్నయ్యకి వుత్తరం రాసెయ్యొచ్చు ఆ సంబంధం మానుకొమ్మని. ఇలా ఆలోచిస్తూన్న నీలవేణి 'పోస్ట్' అన్న కేకతో వులిక్కిపడింది ఈ రోజేమిటో ఇన్ని వుత్తరాలు అనుకుంటూ పోస్టుమేన్ చేతిలోంచి కార్డు అందుకుంది చాలాకాలం తరువాత మీనాక్షి రాసిన వుత్తరం అది. తనూ, మీనాక్షీ ఫోర్తుఫారందాకా కలిసి చదువుకున్నారు

"నిజం చెప్పవే నీలూ! నన్నెవరైనా పెళ్ళి చేసుకుంటారంటావా?" అంటూ వుండేది ఆ పిల్ల.

పాపం మీనాక్షి అందంగా వుండదు. కాకి నలుపు అటువంటి దానిక్కూడా ఇన్నాళ్ళకి ఓ సంబంధం కుదిరింది.

"చేరెడేసి కళ్ళు, చంద్రబింబంవంటి ముఖమూ వున్న నీకే ఇంతవరకూ

ఇంకా ఏమున్నా విశేషాలు ఉన్నాయా.....




మొగుడు దొరకలేదు. కాని నీలూ, నాది కాకి నలుపు ముఖమని తెలిసికూడా నన్ను చేసుకుంటానని ముందుకొచ్చాడే ఒక మగధీరుడు నా అనాకారితనానికి ఖరీదు కట్టి అతగాణ్ణి బేరమాడేశాడు మా అన్న శ్రీపతి" అంటూ మీనాక్షి రాసిన ఆ నాలుగు మాటల్లో ఎంత వేదన దాగివుంది!

ఆ రోజు లైబ్రరీకి వెళ్ళిన నీలవేణికి అంతకు ముందురోజే కమలాకరం వచ్చాడన్న వార్త తెలిసింది. "ఈ సాయంత్రం ఆరు గంటలకి పార్కులో మిమ్మల్ని కలుసుకుంటానని చెప్పాడండి కమల మీ రొస్తే చెప్పమన్నాడు" అన్నాడు లైబ్రేరియన్

సరిగ్గా ఆరు గంటలకి పార్కులోకి అడుగుపెట్టింది నీలవేణి మేమిద్దరూ తరచుగా కూర్చునే అదేచోట పచ్చికలో చేతులూని, కొంచెం వెనక్కివాలి ఆకాశం కేసి చూస్తున్నాడు కమలాకరం నీలవేణి నెమ్మదిగా నడుచుకుంటూ వచ్చి అతని పక్కగా కూలబడింది అలా కూర్చుంటున్నప్పుడు ఆమె పమిట జారి అతని చేతి వేళ్ళను మృదువుగా తాకింది. గిలిగింతలు పెట్టినట్టున్న ఆ స్పర్శకు వులిక్కిపడ్డ కమలాకరం

"హలో నీలవేణీ!" అంటూ సర్దుకుని కూర్చున్నాడు

"అంత అర్ధాంతరంగా వెళ్ళిపోయారు. ఏమిటి విశేషం?" అంది నీలవేణి చీర కుచ్చెళ్ళని పాదాలమీదికి లాక్కుంటూ

పేలవంగా నవ్వేడు కమలాకరం.

"పోన్లెండి. అంత చెప్పకూడని విషయమైతే" కొంచెం నిష్ఠూరంతో అంది అతన్నుంచి సమాధానం రాకపోయేసరికి.



## మహాయానం

దినం ముఖాన
కాలం కప్పిన
నల్ల రెక్క-రేయి
నక్షత్రాలు పళ్ళ చక్రాలలో
నొక్కులు పడుతోంది !
గాలి గుర్రానికి
కాళ్ళు కట్టేసి
మీసం దువ్వుకుంటున్న
నిశ్శబ్దాన్ని చూసి
ఊపిరాడని చెట్టుకు
ఉక్కపోస్తోంది !
నేలమీదకు వంగిన
ఆకాశ రేఖావృత్త గర్భంలోని
కాంతి శిశు గుండ్రాన్ని
ఈ చేత్తో పైకెత్తి
ఏక్కుల సంధిలో
దిక్కూ మొక్కూ లేకుండా
పడి వున్న
చైతన్యం ముక్కల్ని
ఏరుకొద్దామని
తూర్పు వైపు
బయలుదేరాను.

—"సాంధ్యశ్రీ"



"కాదు నీలవేణీ ముఖ్యంగా నీతో చెప్పాల్సిన విషయమే. అందుకే నిన్నిక్కడికి రమ్మందికూడా నా చెల్లెలు చావబోయి బతికింది!" అతని కంఠం గద్గదికమైంది ఆ మాటలంటున్నప్పుడు.

నివ్వెరపోయింది నీలవేణి.

"నీలాగే పాతికేళ్ళు దాటినా కన్నెపిల్లగానే మిగిలిపోయిన దురదృష్టవంతురాలు మా విమల. వివాహంమీద అన్ని ఆశలూ వదులుకున్నదాన్ని కట్నంలేకుండా చేసుకుంటానని ఆశలు కల్పించి ముందుకొచ్చాడు ఓ దౌర్భాగ్యుడు తీరా ముహూర్తాలు పెట్టుకునే సమయం దగ్గరకొచ్చేసరికి తలిదండ్రుల నిర్బంధానికి జడిసి కనీసం అయిదు వేలైనా కట్నం లేనిదే పెళ్ళికి ఒప్పుకోనని ప్లేటు ఫిరాయించాడు. పిరికిపంద ఈ వార్త తెలిసి అది నూతిలో దూకి ప్రాణాలు తీసుకోబోయింది సమయానికి ఎవరో చూసి రక్షించబట్టి సరిపోయిందిగాని " అతని కంఠం దుఃఖంతో పూడుకుపోయింది.

కాసేపు మౌనంగా వుండి అన్నది నీలవేణి

"మీరేం దిగులుపడకండి. మా అన్నయ్య మీ చెల్లెల్ని చేసుకునేటట్టు నేను ఒప్పిస్తాను అప్పుడు మనపెళ్ళీ మీ చెల్లెలు విమల పెళ్ళీ ఒకేసారి జరిపెయ్యొచ్చు ఏమంటారు?" అని ఆశగా అతనివంక చూసింది

అంత విషాదంలోనూ ఫక్కుమని నవ్వేడు కమలాకరం.

"మనిషికి కొన్ని మంచి ఆలోచన్లు చాలా ఆలస్యంగా వస్తుంటాయి నీలవేణీ. జరగాల్సిన అనర్థాలన్నీ జరిగిపోయాక"

అతని మాటలు అర్థం కాలేదు ఆమెకి.

"మా విమలకి అయిదువేల కట్నంతో వేరే సంబంధం ఖాయమైంది ఇది




సాధించడానికి ఆత్మను చంపుకున్నాను. నేను నమ్మిన ఆదర్శాలను అమ్ముకోవాల్సి వచ్చింది ఎవరో ముక్కూ ముఖం తెలియని అమ్మాయికి అమ్ముడు పోవటానికి అడ్వాన్సుగా అయిదువేలుకూడా తీసేసుకున్నాను "

ఆ మాటలు విన్న నీలవేణి హతాశురాలైంది తన ముందున్న పచ్చగడ్డి భగ్గున మండి తను కట్టుకున్న ఆశాసౌధాలన్నీ ఆ మంటల్లో కాలి కూలిపోతున్నట్లనిపించింది

చీకటిపడింది. పార్కులో దీపాలు వెలిగాయి నిర్వేదంతో పచ్చగడ్డిమీంచి లేచింది నీలవేణి

కొన్నాళ్ళు గడిచేయి

తిరుపతి కొండమీద కళ్యాణ శోభతో మంటపం కళకళలాడుతోంది నిమిషాల మీద పెళ్ళిళ్ళు జరిగిపోతున్నాయి. పసుపు బట్టల కమ్మటి వాసనలు, పట్టుచీరల గరగరలు, పురోహితుల అరుపులు—ఈ సందడిలోంచి "హేయ్ నీలూ!" అన్న పిలుపు విని వెనక్కి తిరిగింది నీలవేణి. తన కెదురుగా నవ్వుతూ నిలబడివున్న మీనాక్షిని గుర్తుపట్టడానికి కొంతసేపు పట్టింది.

"ఏమిటే ఇక్కడ ప్రత్యక్షమయ్యావ్? ఏమిటీ వేషం? చూస్తూంటే నువ్వుకూడా నాలాగే కాబోయే శ్రీవారికోసం వెతుక్కుంటున్నట్టుందే!" స్నేహితురాలి భుజాలమీద చేతులువేసి అడిగింది మీనాక్షి.

"అబ్బ! ముందు ఈ సంతలోంచి బయటపడాలి. అక్కడెక్కడయినా తీరిగ్గా కూర్చుని మాటాడుకుందాం పద" అంటూ మీనాక్షితోకూడా మంటపం బయటికి నడిచింది నీలవేణి.

ఇద్దరూ దూరంగా వెళ్ళి మెట్లమీద

కూర్చున్నారు.

"అయితే ఇదన్నమాట, సంగతి" అంది మీనాక్షి నీలవేణి చెప్పిందంతా విన్నాక

"ఇప్పటికైనా మించిపోయిందేంలేదు. పద నేను చక్కబరుస్తాను అన్నీ" అని పైకి లేచింది

"అరె! మీ రిక్కడున్నారా! మీకోసమని అర్ధగంట నుంచీ గాలిస్తున్నాం మేము" అంటూ అక్కడికొచ్చారు నిరంజనరావు, శ్రీపతి ఆ నలుగురూ అక్కణ్ణించి బయలుదేర బోతుండగా వాళ్ళని కలుసుకున్నారు కమలాకరం అతని చెల్లెలు విమల. మీనాక్షి నీలవేణి చెవిలో ఏదో చెప్పింది కమలాకరాన్ని చూపిస్తూ సిగ్గుతో నిండిన చిరునవ్వుతో తల దించుకుంది నీలవేణి.

చూపులు పక్కకి తిప్పుకున్నాడు కమలాకరం

"ముహూర్తాని కింక అర్ధగంటేవుంది. త్వరగా తెమలండి మరి" అని తొందర చేశాడు నిరంజనరావు

"ఒక్కనిమిషం ఆగండి అన్నయ్యా! ఓసారిలారా" శ్రీపతిని అవతలకు పిల్చింది మీనాక్షి. తక్కిన నలుగుర్నీ చూపిస్తూ అతనితో కాస్సేపు మాట్లాడింది ఓ పావు గంట తరువాత వచ్చి మళ్ళీ కలుసుకుంది

"చూడండి! ఇప్పుడు నేనో చిత్రమైన సంగతి చెప్పబోతున్నాను అది విన్న తరువాత మనం తీసుకోబోయే నిర్ణయం మీదే మన పెళ్ళిళ్ళు ఆధారపడతాయి.

నా పెళ్ళి జరిపించాలని అప్పుచేసి అయిదువేలు కట్నంగా ఇచ్చుకున్నాడు కమలాకరానికి మా అన్నయ్య శ్రీపతి ఆ డబ్బునే కమలాకరం నిరంజనరావుకి సమర్పించుకున్నాడు తన చెల్లెలు విమల పెళ్ళికి కట్నంగా.

ఆ అయిదువేలే ఇప్పుడు నిరంజనరావు మా అన్నయ్య కివ్వబోతున్నాడు నీలవేణికి కట్నంగా. నా పెళ్ళికోసంగాను మా అన్నయ్య ఇచ్చుచున్న కట్నం చేతులు మారి మళ్ళీ అతని దగ్గరకే చేరుతోంది. ఈ చేతులు మారటంలో ఎవ్వరికీ రవ్వంత ప్రయోజనం లేకపోగా ఒక ప్రేమికుల జంట అప్యాయంగా విడిపోతూంది అంచేత మనమిప్పుడు చేయాల్సింది ఆ జంటను కలపడం. అది మన బాధ్యత" చెప్పడం ఆపి అందరి ముఖాల్లోకి చూసింది మీనాక్షి

ఓ అయిదు నిమిషాలపాటు అక్కడ ఆ ఆరుగురి మధ్య చీమ చిటుక్కుమనేటంత నిశ్శబ్దం ఆవరించింది

"మీనాక్షీ! మరి నీ సంగతో"— నీలవేణి.

"చూడండి మీనాక్షిని నేను చేసుకుంటాను, విమలని శ్రీపతిగారు అంగీకరించే పక్షంలో" అన్న నిరంజనరావుకేసి నమ్మలేనట్టుగా చూశారు అందరూ

తన అంగీకారాన్ని చిరునవ్వుతో వ్యక్తంచేశాడు శ్రీపతి.

"నిరంజనంగారూ? నేను కాకి నలుపం డోయ్" అన్నది మీనాక్షి నవ్వుతూ

"చూసే కళ్ళల్లో సౌందర్య తృష్ణ వుండాలేగాని—నల్లగా వున్నా మీరే నా కళ్ళకి అందంగా కనిపిస్తున్నారు "

నిరంజనరావు మాటలకి అంతా ఆనందంగా నవ్వుకుని వడివడిగా కళ్యాణ మంటపంకేసి నడిచారు.



# మర్రిచెట్టు - మల్లెతీగ

శ్రీమంతుని శరీరంలా పచ్చగా, బలంగా, ఎత్తుగా —
జయంట్ మొనోపలిస్టిలా, నింగి నంటుతోంది మర్రిచెట్టు!
సామ్రాజ్యవాది కాంక్షలా, ఎన్నటికీ తీరని లోభివాని ఆశలా
సుదీర్ఘ శాఖా రాకాసి స్వార్ధ బాహువుల్ని, ఆబగా, ఆత్రంగా చాచి —
అవనీతలాన్ని అంగుటిలోకి తేవాలని విస్తరించుకు పోతోంది
తన వెచ్చదనానికి త్రుళ్ళి — పక్కవాని పచ్చదనానికి క్రుళ్ళే
ధూర్త పెత్తందారు వలె, చిరు చేపల్ని కబళించే పెద్ద చేపలా
తన నీడ సాగినంత దూరం ఏ చిన్న తీగా, ఏ గున్న మొక్కా
నవజీవన చైతన్య శోభలతో, కళకళ లాడరాదని
సూర్యుణ్ని బంధించి — కాంతి పోషకా హారాన్ని తానే హరించి
మరో విశాల స్మశాన సృష్టికి — విష ఊపిరు లూదుతోంది!
ప్రజా పీడక కీచక వర్గాలు, రక్షణకై రౌడీలను నియమించినట్టు
మర్రిచెట్టు సామ్రాజ్యాన్ని పహరా కాస్తున్నాయి బలమైన వూడలు!' —
జాతి నిత్య జీవితావసర జీవనాడుల్ని బంధించిన బిజినెస్ మాగ్నెట్‌లా
వ్రేళ్ళని సుదూరాలకు విస్తరిస్తూ, అందిన సారాన్నంతా పీలుస్తూ
ఇంకా కలిమినీ, బలిమినీ పెంచుకు పోతోంది!!
మర్రిచెట్టు నీడలు, వూడలు, వ్రేళ్లు చేరలేని మరోచోట
మంచివాని మనస్సులా, ధవళ సుగంధ సుమాల కళ్ళు విప్పి
అమాయకోత్సాహంతో, అందంగా, ఆనందంగా త్రుళ్లుతోంది మల్లెతీగ!
గాలి, వాన, నేల, ఉష్ణం — సన్మిత్రులందించే స్వల్పసారంతోనే
ఎవరి పురోగతికీ గొలుసుకాని — ఎవరి కంట్లోను నలుసుగాని —
తన చిరు స్వర్గాన్ని తానే వినిర్మించుకు మురిసిపోతోంది
ఆజన్మ సంస్కారిలా, బాధ్యత కలిగిన బీద ధీర పౌరుని వలె
ఇరులకు కీడై, ఇతరులకు తోడై, సదాశయాల చక్కని పాడై
పరిసరాలని పునీతం చేస్తూ, ప్రభావితం చేస్తూ
నిగర్వితగా, కోట్లాది జీవజాలంలో — తానూ ఒకటిగా
ప్రాణాలకు పహరా అవసరంలేని, పరపీడనావశ్యకత రాని
ప్రశాంత మధురానంద జీవనం గడుపుతోంది మల్లెతీగ!!
పీడిత జన చైతన్యపు విప్లవ పెను తుఫానులో —
ఎంత బలమున్నా, ఎన్ని రక్షణలున్నా పడి నశిస్తుంది మర్రిచెట్టు —
ఆగామి ప్రళయ విప్లవానంతర సమసమాజ శుభ్ర వాతావరణంలో
మానసోల్లాసంగా, కలకాలం మనుగడ సాగించేది మల్లెతీగ మాత్రమే!!!

— బొడ్డపాటి సూర్యనారాయణమూర్తి

# యేసూ అనగ రక్షకుడు

క్రీస్తు ప్రభువును 'కపాలము' అనే స్థలములో సిలువ లేసినప్పుడు ఇద్దరు బందిపోటు దొంగలను కూడ సిలువలేశారు. వారు నీవు క్రీస్తును (రక్షకుడవు కావా) అట్లయిన మమ్ము రక్షించమని పరిహసించినవారే అయితే సిలువపై మొదటిగా పల్కిన మాటలతో ఒకనికి మారు మనస్సు కలిగి వెంటనే ఏసుని చూచి 'ఏసూ' (రక్షకుడా) నీవు నీ రాజ్యములోనికి వచ్చునపుడు నన్ను జ్ఞాపకము చేసుకొనమని అడిగియున్నాడు వెంటనే ప్రభు నేడు నీవు నాతోకూడ పరదైసులో యుందువని దొంగతో చెప్పినట్లు దైవ గ్రంథములో వ్రాయబడి యున్నది ఆ దొంగ పాదాలు కీడు చేయుటకు పరుగెత్తిన పాదాలేగాని, తోటి మానవులకోసం, పరుగెత్తి మే లొసంగిన పాదాలు కావు మరుక్షణం మృత్యు ఒడిలో తల దాచుకోపోతున్నవాడు. ఆ ప్రభుకో ఏమివ్వగలడు? పశ్చాత్తాపముతో వెలువడిన, ఆ దీన ప్రార్థన ప్రభువు ఆలకించి, తన రాజ్యపు వెలుగులోనికి నడిపించగలడనే నిరీక్షణ తప్ప భగ్నజీవికి వేరే నిరీక్షణ లేదు. ఆ నిరీక్షణే అతనికి ప్రభువుతో పరదైసులో ప్రవేశించే అర్హతను కలిగించింది మన మంతా విశ్వాసము ద్వారా కృపతో రక్షింపబడియున్నాము మన పాపములను మనము ఒప్పుకొనిన యెడల ఆ ప్రభువు నమ్మదగినవాడు గనుక మన పాపములను సమస్త దుర్నీతినుండి మనలను పవిత్రులనుగా చేయును.

—చదలవాడ చంద్రమతీదేవి

# చివరి మాట

'రాం'—ఒక మంచి మిత్రుడు. అంత కంటే మంచి భావుకుడు, రసజ్ఞుడు మేధావి, కవి, భావశాలిత్వమూ, కల్పనా చమత్కృతీ, అభివ్యక్త సంవిధానమూ— ఈ ధాతువులన్నీ రాంలో పుష్కలంగా వున్నాయి. తన నిరాడంబర భావనలనూ, కామనలనూ, సరికొత్తగా — అనవసర హంగామా పోజూ, ఎస్సంప్షనూ లేకుండా అతి నిర్మలంగా అభివ్యక్తం చేయగల తెలుగు కవులలో నిస్సంశయంగా రాంని చేర్చక తప్పదు బాహ్య జగత్తులోని వికృతాలనిగానీ, అంతరంగాంతరాళలోని ప్రవృత్తులనుగానీ, అతి సూటిగా సభ్యతగా, సులభంగా, సున్నితంగా చెప్ప గలడు. విర్రవీగుతున్న కుహనా విలువలను గొంతెత్తి గదమాయించే ధైర్యం వీరి కవితల్లో సరికొత్తగా కన్పిస్తుంది.

ఇది అతని కవితా సంపుటికి ముందు మాట రాస్తూ—ఓ ప్రఖ్యాత కవి వెలిబుచ్చిన అభిప్రాయం.

తెలుగు నాట మెజారిటీ పీరికా కర్తలు తమ పేజీల్లో—లేని దాన్ని ఉల్లేఖించి, ఉన్నదానికి పరదా వేస్తారనే చేదు నిజం — రాం సంపుటి విషయంలో చెల్లదు. చాలా మంచి కవితలు ఊహల లోకాల్లో, అందని తీరాల్లో, అనుభవాల కతీతంగా, ఎరువు తెచ్చుకొన్న అభిప్రాయాల్లో విపరీత చమత్కారంతో, పదాల విన్యాసాలతో — అద్భుతాలు కావు! వాస్తవాలు జీవన అంత! ప్రవాహంలోని కెరటాలు తానేమి రాస్తున్నారో, ఏ స్థాయి జనం చదువుతారో, తెలిసిన కొద్దిమంది కవుల్లోనివాడు — మిత్రుడు రాం!

'ముందు మాట' రాసిన ప్రఖ్యాత కవి 'రాం'ని దీవిస్తూ రాసిన కవిత కంటే, రాం రాసినవే గొప్పగా వున్నాయి పెద్ద వానికి చిన్నవాడు ఆశీస్సు లిచ్చినట్టుగా వుందా కవిత.

ఓనాడు—ఆర్థికంగా కలిగిన వత్తిడిని బట్టి రాం దగ్గరికెళ్లేను ఆ సమయాని కతడు స్నానం చేస్తున్నాడు అతని శ్రీమతి కూర్చోమని చెప్పి వెళ్ళిపోయింది. టీపాయ్ ముందున్న చెయిర్‌లో కూర్చున్నాను టీపాయ్ మీద ఓ రాజకీయ వార పత్రిక ఆ నెల విజయచిత్రతో పాటు, రెండు ఉత్తరాలు ఉన్నాయి ఒకటి కార్డు నాచూపు అన్యమనస్కంగా, ఆకార్డ్‌పై స్టాంపుపై నిలిచింది 'ప్రఖ్యాత కవి' రాసిన ఉత్తరమది? కవుల ఉత్తరాలలో కూడా కవితాత్మ ఉంటుందట

ఉత్తరం అందుకొన్నాను.

ప్రియ రాం,

'మీరు యివ్వాల్సిన పైకం యింకా పంపలేదు. పుస్తకం అచ్చయ్యేక యిస్తానని మీరే అన్నారు. మనం అనుకొన్న రేటు ప్రకారం—మీ పేర అచ్చయిన నా గేయాలకు డబ్బు పంపగలరు. నమ్మండి నమ్మకపోండి గేయం రాయడం ఎంత తేలికో, దాన్ని పత్రికకు పంపడం అంత కష్టమైపోతూంది. అన్యథా భావించకండి. యింకా ఎవరికైనా గేయాలు కావాలంటే నాకు రాయండి.సంతకం గజిబిజిగావుంది.

—రాం వచ్చాక పిచ్చాపాటీ మాటల్లో ఓ అరగంట గడిపి, బయటపడ్డాను—నా అవసరాన్ని రాంతోఎలాచెప్పుకోను?తెలిసీ!

—రచన జాతశ్రీ

# చేయూతకోసం....

"సిస్టర్! పిలిచింది రేవతి.

రేవతికి ఇంజక్షన్ చేసి వెళుతున్న నర్సు వెనక్కి తిరిగి చూసింది

"సిస్టర్! నీపేరేమిటో? నాకో సాయం చేస్తావా?"

"ఏం కావాలి?"

"చేస్తానంటేనే అడుగుతాను కాదన కూడదు." చేతులు జోడించబోయింది

"ఊహూ! ఏమిటో చెప్పు!"

రేవతి కళ్ళు మూసుకుంది. ఆమె ముఖం ఎంతో నిర్మలంగా వుంది. వణుకు తున్న స్వరంతో అంది

"ఏమీలేదు నాకు శాశ్వతంగా కన్ను మూసే ఇంజక్షనొకటివ్వు!"

నర్సు బాధగా రేవతివేపు చూసింది

"సిస్టర్!"

"ఇలాగైతే నీ దగ్గరకేరాను" అంటూ కదలబోయింది

రేవతి లేచి గభాల్న నర్సు చెయ్యి పట్టుకుంది కళ్ళవెంట వర్షంలా నీరు నర్సు మనసు మెత్తబడింది "తప్పు రేవతీ! అలాంటి మాటలు అనకూడదు పిచ్చి ఆలోచనలు మాని విశ్రాంతి తీసుకో." అంటూ చేయి విడిపించుకోబోయింది.

"వద్దు సిస్టర్! నన్ను వదిలిపోకు నేను బ్రతకడం అనవసరం" వణకిపోతూ అంది రేవతి.

ఏదో బలీయమైన కారణమే వుందని వూహించి. "అవును రేవతీ! మీ వాళ్ళెవరూ రాలేదేమిటీ!" అన్నది నర్సు

ఆ మాటతో రేవతి ముఖం వాలిపోయింది వణుకు పుట్టుకొచ్చింది. నర్సు చేతిని వదిలి చేతులతో ముఖం కప్పుకుని భోరున ఏడ్చింది

నర్సు తేరుకుని "నీ భర్త కూడా రాలేదేం?" అడిగింది జాలిపడుతూ—

"సిస్టర్! నా భర్తరాడు, తల్లీ, తండ్రీ ఎవ్వరూ రారు మా కుటుంబంలో నా పేరు మాసిపోయింది నేను చచ్చిన దాంతో సమానం. ఇంకా నేను ఎందుకు బ్రతకాలి?"

"చూడు రేవతీ! చచ్చి సాధించేదేమీ లేదు పరిస్థితులెప్పుడూ ఒకేలా వుండవు నీ భర్త తప్పకుండా వస్తాడు. ధైర్యంగా వుండు" నచ్చచెప్పింది భర్త సరిగా చూడ్డం లేదనుకుని.

"లేదు సిస్టర్! నా భర్తరాడు. ఎవ్వరూరారు వస్తారని ఆశలేదు గాలి పటం తాడు తెగితే ఎక్కడో రాలిపోతుంది. చివరికి చీలికలై పోతుంది. అది ఎవరికీ పనికిరాదు. అంతే సిస్టర్! అంతే"

రేవతి దుఃఖం, ఆమె జబ్బు పరిస్థితి నర్సు హృదయాన్ని కలిచివేశాయి రేవతి పరిస్థితిని అర్థంచేసుకుంది కాని తనేమీ చెయ్యలేదు. ఆమెను చేర్పించిన డాక్టరుతో మాట్లాడితేగాని అసలు విషయం తెలియదు అనుకుంది రేవతి చేయి నిము

నిమ్మగడ్డ రామలింగేశ్వరరావు

రుతూ నర్సు

అప్పటికే అలిసిపోయిన రేవతి కను రెప్పలు మూతపడుతున్నాయి. మెల్లగా నడిచి బయటకు పోయింది నర్సు సుహాసిని.

"రేవతీదేవిగారూ?"

రేవతికి ఎక్కణ్ణించో, ఎంతో దూరం నించి పిలిచినట్టుందా పిలుపు. ఆ పిలుపులో ఆర్ద్రత, ఆప్యాయత, అభిమానం పుట్టి పడుతోంది ఆ పిలుపు రేవతి హృదయాన్ని సున్నితంగా తాకింది. కళ్ళు తెరిచి చూసింది ఎదురుగా డాక్టరు. మెడలో స్టెత్ తగిలించుకుని ఎంతో హుందాగా వున్నాడు

చిరునవ్వుతో తనవేపు చూస్తున్నాడు

ఆ చిరునవ్వు చూశాక రేవతి మనసులో ఆందోళన బయలుదేరింది అలాంటి చిరునవ్వు, అందం, అభిమానం చూసే తనారోజు మురిసిపోయింది. గతం తలుచుకునే సరికి వళ్ళు గగుర్పొడిచింది. అమావాస్య చీకటిలా భయం ఆవహించింది. వణుకుతూ గట్టిగా కళ్ళు మూసుకుంది.

* * *

రేవతి చలాకీ పిల్ల. హైస్కూల్లో ఆమె అందాన్ని ఆరాధించని రోమియోలు లేరు. అదుపుతప్పిన గడుగ్గాయిలు ఆమె చేతి దెబ్బను రుచి చూశారు

దోవన పోయే మనుషుల్ని నిలేసే అందం రేవతిది



అన్ని హంగులూ వున్న ఆడపిల్ల రేవతి.

అందరి అభిమానాన్ని సంపాదించిన స్టూడెంటు రేవతి.

రేవతి ఆడపిల్లలకి లీడరు. మగపిల్లలకి కమాండరు. ఆమె ఆడింది ఆట పాడింది పాటగా జరిగిపోయింది హైస్కూలు జీవితం

కాలేజీలో చేరాక రేవతిలో పెద్ద మార్పే వచ్చింది వయసులో ఆలోచనల్లో ప్రవర్తనలో అందంలో మార్పు

ఇప్పుడు రేవతి వూహా ప్రపంచంలో విహరిస్తోంది ఆమె కలలుకనే కళ్ళుచూసి అబ్బాయిలు కలలు కన్నారు. ఆమెను ప్రేమించాలనీ, ప్రేమించబడాలనీ ఆరాట పడ్డారు చాలామంది

ఎవరికీ అందని ఆశ రేవతి

అందరి మనసూ రేవతి మీద వుంటే, రేవతి మనసు ఆకాశంలో విహరించేది. తన అందం ఏ సినిమా స్టార్సకీ తీసిపో దని రేవతి నమ్మకం చరిత్ర ప్రసిద్ధి పొందిన అందకత్తెలు తనకంటే ఏమీ ఎక్కువకాదని ఆమె గర్వం సినిమా హీరోయిల్నందరినీ పోల్చుకోడం ఆమె హాబీ

ఓనాడు రేవతి తన క్లాస్‌మేట్ రమ పెళ్ళికి వెళ్ళింది. రమ ధనవంతుల బిడ్డ. ఓ డాక్టరు కిచ్చారు. పెళ్ళికొడుకు అందగాడే రేవతికతడు బాగా నచ్చాడు. అతనిలో ఏదో ప్రత్యేకత కనిపించింది. పెళ్ళయాక రమని తీసుకుని అమెరికా వెళతాడని తెలుసుకుంది.

రేవతి ఆలోచించింది. తను గూడ ఓ మంచి, అందగాడైన డాక్టర్ని చేసుకుంటే? ఆవును తనుకూడ అమెరికా వెళ్ళవచ్చు. అనుకోగానే వళ్ళు పులకరించింది విమానంలో ప్రయాణం చేస్తున్నట్టే వూహించుకుంది ఇండియాలో పుట్టి అమెరికాలో జీవితం ఓహ్! ఎంత హాయి! అమెరికా జీవితమే జీవితం ఇండియాలో ఆడది ఓ బానిస మొగుడికో పనిమనిషి. విలాస వస్తువు

తను చేసుకుంటే డాక్టర్నే చేసుకోవాలి. అమెరికా వెళ్లాలి. జీవితం అనుభవించాలి నిశ్చయించుకుంది రేవతి

రేవతి ఎరువుల వ్యాపారి రంగనాధం పెద్ద కూతురు రేవతికి తండ్రిదగ్గర బాగా చనువు. మాటల సందర్భంలో తన వుద్దేశం వెలిబుచ్చింది మొదట రంగనాధం నిరుత్సాహపడలేదు. ఎరిగున్న వాళ్ళందరికీ చెప్పాడు డాక్టరుకోర్సు చదివేవాళ్ళ లిస్టు దగ్గరుంచుకుని మరీ తిరిగాడు ఫలితం శూన్యం కొండకి నిచ్చెన వేశాననుకున్నాడు కూతురి కోరికల మధ్య, పెళ్ళి కొడుకుల డిమాండ్‌ల మధ్య నలిగిపోయాడు రంగనాధం

రేవతి కాలేజీ చదువు పూర్తయింది రేవతి కోర్కె అలాగే మిగిలిపోయింది

తల్లీ, తండ్రీ పోరగా ఓ సంబంధానికి వప్పుకుంది రేవతి. అతడే లాయరు ప్రభాకరం. ఒక్కవృత్తి తప్ప రేవతి కోరుకున్నవన్నీ అతడికున్నాయి మంచి రంగు, వెడల్పాటి కళ్ళు, నిండైన విగ్రహం అతనిది ఖద్దరులాల్చీ, పట్టంచు ధోవతీ, కాళ్ళకి చెప్పులు ఆకర్షణీయంగానే వుంది అతని డ్రెస్. కాని ఫుల్‌సూటులో




వుంటాడనుకున్న రేవతికి నిరాశే ఎదుర యింది

చూపుల తతంగం ఐపోయాక ప్రభా కరం ఓ కె అన్నాడు.

రేవతి డైలమాలో పడింది

ప్రభాకరం బాగా ప్రాక్టీసు వున్న లాయరు. రెండుచేతులా సంపాదిస్తు న్నాడు ఓ మేడ, కారు అన్నీ హంగులూ వున్నాయి కాని డాక్టరు కాదు అమెరికా వెళ్ళే యోగంలేదు డాక్టర్లు చాలా ఖరీదైన వాళ్ళు. తన కందరు. ఎటూ తేల్చుకోలేక సతమతమయిపోయింది.

అది గ్రహించిన రేవతి తండ్రి "తల్లీ! నీ కోర్కె తప్పుకాదు, కాని మన పరిస్థితిని బట్టి ఆలోచించుకోవాలి సుఖంగా జీవిం చడమనేది కేవలం వృత్తిమీదనే ఆధార పడి వుండదమ్మా! భార్యా భర్తల అను రాగం, సంస్కారం మీద ఆధారపడి వుంటుంది. ఇక నీ యిష్టం. చదువుకున్న దానివి జ్ఞానం తెలిసిన పిల్లవు ఆలో చించు" బోధించాడు రేవతికి. రేవతి తల్లికి బోధించడం చాతగాక కూతురు మీద విసుక్కుంది కూతురు ఎక్కడ కాదం టుందోనని భయపడి, ఇంత మంచి సంబం ధం ఇక నీ జన్మలో రాదని గట్టిగా చెప్పింది.

రేవతి సతమతమయిపోయింది తండ్రి మాటలు వాస్తవమని తోచాయి తన కోర్కె తీరేదికాదని తెలుసుకుంది

"ఏమని కబురుచెయ్యమంటావుతల్లీ!" అని తండ్రి అడగ్గానే రేవతి తలూపింది సమ్మతమే నన్నట్టుగా

* * *

రేవతి అత్తవారింట అడుగుపెట్టాక

తన జీవిత ప్రణాళికలో మొదటి భాగము హనీమూన్. మొదట దక్షిణాది ప్రాంతం చూడాలని వుబలాటపడింది. ఆ తరవాత ఉత్తరాది ప్రాంతం తిరిగి నిండుపున్నమి వెన్నెల్లో తాజ్‌మహల్ అందాన్ని ఆస్వాదించాలనుకుంది. అనుకుందే తడవుగా భర్తని అడిగింది "ఏమండీ! ఇద్దరం కలిసి అటు మైసూరు చూసి వద్దామండీ. అటు హనీమూన్ పోయివచ్చి నట్టుంటుందీ, ఇటు మీకు కాస్త విశ్రాంతి దొరికినట్టుంటుంది."

ప్రభాకరం ఓ నిమిషం ఆలోచించి "నీ కోర్కె సబబే కాని- ఇక్కడ ఓ ముఖ్యమయిన కేసు వుంది ఇప్పుడు వీలు పడదు. ఇక కోర్టుకు సెలవు లిచ్చినపుడే సాధ్యమవుతుంది" అన్నాడు ప్రభాకరం.

ఆ సమాధానం రేవతికి రుచించలేదు. భర్త తన మాటకు విలువనివ్వకపోవడం తన్నవమాన పరచడమేనని భావించింది రేవతి

'ఏమిటీయన తత్వం? పొద్దుట లేవడం ఆలస్యం పార్టీలు వచ్చి కూచుంటారు. గొంతులో కాఫీ గొంతులో వుండగానే ఆఫీసురూములో జొరబడతాడు. ఇక కోర్టుకు పోయే టైముకి హడావిడిగా వచ్చి భోజనంచేసి కోర్టుకు వెళతాడు కోర్టునుంచి రాగానే మళ్ళీ పార్టీలు, కేసులు మళ్ళీ మామూలే. భార్య ఒంటరిగా వుంటోందనే ధ్యాసే వున్నట్టు కనిపించదు. కనీసం రాత్రిపూటయినా సర్దాగా మాట్లాడదామంటే కూడ వీల్లేకపోతోంది. భార్యభర్తల అనుబంధం లేదు. ఆత్మీయత లేదు. ఆయనకోసం ఎదురు చూసీ, చూసీ విసుగు పుడుతోంది. అసలు తనంటే ప్రేమ వుందా? తన అందం భర్తని ఆకర్షించలేకపోతోందా? లేక అందాన్ని అనుభవించడం ఆయనకి తెలియదా? ఏదో అనుమానం తన అందమంతా వృధాపోతోందే అని బెంగ.' ఇలా ఎన్నో వూహించింది రేవతి

ఓ రోజు హఠాత్తుగా జబ్బు చేసింది రేవతికి హాస్పిటల్లో చేర్చారు డాక్టర్ కృష్ణమోహన్ శ్రద్ధవల్ల త్వరగానే కోలుకుంది. ఇంటికి వచ్చాక కూడ డాక్టర్ వచ్చి చూసిపోతూ వుండేవాడు కొద్ది కాలంలోనే అనారోగ్యం నుంచి కోలుకుంది.

డాక్టర్ కృష్ణమోహన్, లాయరు ప్రభాకరం స్నేహితులు అతనికింకా పెళ్ళి కాలేదు తెలివిగలవాడు. అందగాడు

డాక్టరు కృష్ణమోహనంటే రేవతికి ఏదో అభిమానం. అతని ప్రవర్తన, అందం, రేవతి అభిమానాన్ని పెంచింది.

"రేవతీ దేవిగారూ! మీ అందాన్ని చూస్తుంటే మీరు పూర్వజన్మలో ఏ దేవతో అయివుంటారు అనిపిస్తోంది. విధివశాత్తు మానవుల్లో పుట్టారు మిమ్మల్ని చేసుకున్న లాయరుగారు అదృష్టవంతుడు" అన్నాడు కృష్ణమోహన్ ఒకసారి

రేవతి వళ్ళు పొంగిపోయింది మనసు ఉరకలు వేసింది రక్తం వేడెక్కింది 'ఈనాటికి కదా తన అందానికి గుర్తింపు' అని తన్మయత్వం చెందింది. డాక్టర్ని ఆరాధనా భావంతో చూసింది "డాక్టర్!" అన్నది.

ఆ పిలుపులో (ఏదో) మార్దవం, ఆరా




ధన వినిపించింది డాక్టర్ కృష్ణమోహన్‌కు అలాగే రేవతి కళ్ళల్లోకి చూస్తూ వుండి పోయాడు. ఆనాటినుంచీ రేవతి మనసంతా కృష్ణమోహన్ ఆక్రమించుకున్నాడు. ఇద్దరు స్వర్గంలో విహరిస్తున్నట్టు వూహించింది రేవతి. తన కలలు నిజమయినట్టు తృప్తి పడింది.

తాత్కాలికంగా అణిగిపోయిన రేవతి కోర్కెలు తలెత్తి బుసలుకొట్టాయి ప్రభాకరం ఉదాసీనత నిప్పుకి గాలిలా తోడయింది ఇప్పుడు డాక్టరు ఓ మన్మధు డిలా కనిపిస్తున్నాడు రేవతికి. ప్రభాకర్ వ్యక్తిత్వం మరుగున పడిపోయింది, డాక్టర్ ఉనికి రేవతిని ఉక్కిరి బిక్కిరి చేస్తోంది

ప్రభాకరం ఓ కేసులో తీరికలేకుండా పనిచేస్తున్నాడు. రేవతికి ఏలోటూ జర క్కుండా చూస్తూనే వున్నాడు. డాక్టర్ కృష్ణమోహన్ రేవతి ఆరోగ్యం గురించి శ్రద్ధగా చూస్తున్నాడని నమ్మకంతో తన పనులు చేసుకోవడంలో మునిగిపోయాడు ప్రభాకరం

ప్రభాకరం తన పనుల్లో మునిగిపోయి వుండడం, కృష్ణమోహన్ నిత్యం వస్తూ తన దగ్గరే వుండడం, ఆరాధనతో కూడిన పొగడ్త లందించడంతో, ప్రభాకరం గురించి ఆలోచించడమే మరిచిపోయింది రేవతి. పైగా ప్రభాకరం తన గొడవే పట్టించుకోడం లేదనే ఉద్దేశ్యం బాగా బలపడిపోయింది. ఇప్పుడు రేవతి మనసులో కృష్ణమోహన్ చోటుచేసుకున్నాడు.

రేవతి, కృష్ణమోహన్‌ల మధ్య అభిమానం, ఆత్మీయత పెరిగింది. మనసులు దగ్గరయాయి.

ప్రభాకరం తన మెడలో మూడు ముళ్ళు వేశాడు. తన అందంతో కృష్ణ

మోహన్‌కి ముప్పయి ముళ్ళు వేశానను కుంది. రేవతి కృష్ణమోహన్ చేతుల్లో గాలిపటమయిపోయింది. పటాన్ని ఎగర వేశాడు కృష్ణమోహన్. ఆడించాడు. ఆడీ, ఆడీ తాడు తెగింది.

పటం చిరిగి చీరికలై కింద పడిపో యింది.

*  *  *

"రేవతీదేవిగారూ! కళ్ళు తెరవండి" పిలిచాడు డాక్టర్ ఉలిక్కిపడి కళ్ళు తెరి చింది. డాక్టర్ వేపు చూసింది కన్నీళ్ళు కారుతున్నాయి చెక్కిళ్ళమీదుగా.

డాక్టర్ చలించిపోయాడు. "ఏడుస్తు న్నారా? ఈ పరిస్థితుల్లో మీరు బాధపడ కూడదు. ధైర్యంగా వుండాలి ఇంటికి పోయి మందులు తీసుకుంటూ రెస్ట్ తీసు కోండి. మందులు రాశాను" చీటీ ఇచ్చి కదిలిపోయాడు భారంగా

జరిగిపోయింది తలచుకోగానే వళ్ళు మొద్దుబారినట్టయింది గుండెల్లో నొప్పి ప్రారంభమయింది ఈ జబ్బు నయ మయేది కాదని అర్థమయిపోయింది. ఏమిటి చెయ్యడం! ఏది దారి? ఎందుకీ మందులు? అసలు బ్రతకడం ఎవరికోసం? ఎవరున్నారనీ!—అనుకోగానే దుఃఖం కట్టలు తెంచుకుంది.

మళ్ళీ ఆలోచన ఏం చెయ్యాలి తను? ఇక తనకెవరున్నారు? తండ్రి దగ్గరా, భర్త దగ్గరా తనకు స్థానంలేదు! ఎవరైనా వస్తారా తనకోసం? ఏదో ఆశ మినుకు మినుకుమంటోంది. ఏమో! అసలు తనిక్కడ వున్నట్టు తెలియదేమో? తెలిస్తే మాత్రం వస్తారని నమ్మక మేముంది? తన భర్త తన కోసం రావడం అసంభవం ఆడది ఒక్కసారి కాలు జారితే ఫలితం ఏమిటో తనకు తెలిసి పోయింది. తనకు యెక్కడా స్థానంలేదు. అభిమానం ఆస్తిగా గల తండ్రి అసలు రాడు

ఒక్కసారి రేవతి మనసు భర్త, ఇల్లు సంసారం, తల్లి, అన్నిటినీ తొంగి చూసింది

భర్త మళ్ళీ పెళ్ళిచేసుకుని వుంటాడు. పిల్లలు కూడ కలిగివుంటారు. ఎంత చక్కని పిల్లలు పుట్టారో? అనుకోగానే వళ్ళు జలదరించింది రేవతికి ముఖం మబ్బు కమ్మినట్టయింది. మనసు అరే పోయింది. ఎవర్ని చేసుకున్నాడో? ఆ భాగ్యశాలి ఎవరో? ఒక్కసారి పోయి చూస్తే? పోతే ఆవిడ వూరుకుంటుందా? ఎవరివని అడిగితే ఏం చెప్పాలి? నేను ఫలానా అని చెప్తే వూరుకుంటుందా? భర్త మాత్రం ఎందుకూరుకుంటాడు? జుట్టు లంకించుకుని ఈడ్చివేస్తాడు మెట్ల మీదినించి దొర్లుతుంది తను చచ్చి పోతుంది

ఆలోచనల మధ్యలో తన జీవితానికి ఏదో పరిష్కార మార్గం దొరికినట్లయింది రేవతికి.

ఒక్కసారి లేచి పైకిపోయే మెట్లు ఎక్కడున్నాయో చూస్తే బాగుండునను కుంది. లేచే ఓపిక లేదు దూరంగా ఎక్కడో పసిపిల్ల ఏడుపు వినిపించింది కామన్ హాల్లోంచి ఎవరిదో మూలుగు







సన్నగా వినిపిస్తోంది కళ్ళు మూసుకుంది

నిశ్శబ్ద వాతావరణంలో ఏవో అడుగుల చప్పుడు వినిపించింది. చెవులు రిక్కించి విన్నది

అడుగులు పరిచయమైనవిలాగే వున్నాయే? ఎవరో చూడాలి కళ్లు తెరవాలనుకుంది. తెరవలేకపోయింది అడుగులు మంచం దగ్గరగా వచ్చి ఆగాయి.

రేవతి వణికిపోయింది. చిన్నగా కళ్లు సగం తెరచి వోరగా చూసింది అదిరిపోయింది.

భ్రమ కాదు కదా! గిచ్చుకుంది. చురుక్కుమంది శరీరం

అవే చెప్పులు. అదే రకం ధోవతి పట్టంచు ధోవతి.

ప్రభాకరం తన భర్త. తనకోసం వచ్చాడా? అయ్యో!

ఎందుకొచ్చినట్టు? ఒకవేళ చంపడానికి రాలేదు కదా? ఇక్కడ గొంతు పిసికి చంపితే! అదే కావాలి. తనకు ముక్తి.

"రేవతీ!" మరలా పిలిచాడు

ఆ పిలుపులో ప్రశాంతత, ప్రియుని పిలుపులో వుండే మాధుర్యం, ఆదరణ వుంది

"రేవతీ! నిన్నింటికి తీసుకెళ్ళడానికి వచ్చాను-మన ఇంటికి "

అబ్బా! నన్నింటికి తీసుకువెళతాడా? ఇది సంభవమేనా? తనని కాదనిపోయిన భార్యని మరలా ఆహ్వానిస్తున్నాడా ఇంటికి? ఆయనకి తన సంగతి పూర్తిగా తెలియదేమో? అవును తెలిసివుండదు. లేకపోతే తనని రమ్మని పిలవడమేమిటి?

ఒకవేళ ఇంటికి తీసుకుపోయి గప్ చిప్‌గా చంపుతాడా? ఇక్కడయితే గోలవు

తుందనుకున్నాడేమో! ఛ! అదే అయితే ఆ గొంతులో ఆ మాధుర్యం ఎలా వుంటుంది? ఏమిటో' బొత్తిగా అయోమయంగా ఉంది.

కళ్ళు తెరిచింది రేవతి. శరీరంలో ఏదో శక్తి ప్రవేశించినట్టయింది. ఏమీ తెలీద్దు మంత్రముగ్ధురాలై లేచింది

ప్రభాకరం వెనక్కి తిరిగాడు. రేవతి మంచం దిగింది నర్సు నవ్వుతూ వచ్చి 'విష్ యు బెస్ట్ ఆఫ్ లక్' అంది. రేవతి శిఖ వంగిపోయింది

"నడవగలవా రేవతీ'" అన్నాడు ప్రభాకరం వెనక్కి తిరిగి.

తల వూపింది నాలుగడుగులు వేసింది కాళ్ళు తేలిపోతున్నాయి. కళ్ళు తిరుగుతున్నాయి. తూలిపోయింది. ప్రభాకర్ చేతులు రేవతిని పొదివి పట్టుకున్నాయి. అంతే రేవతి కళ్ళు మూసుకుపోయాయి

* * *

రేవతి కళ్లు తెరిచింది. ఫాను తిరుగుతోంది. చల్లగా హాయిగా వుంది. చుట్టూ చూసింది. తన పెళ్ళినాటి ఫోటో కనిపించింది అదే తన గది. గదిలో మరో ఫోటో లేదు. గదిలో ఏ మార్పూలేదు.

తన భర్త తనను యింటికి తీసుకొచ్చాడు అనుకోగానే మనసు ఉప్పొంగింది.

తన భర్త తనకోసం ఎదురుచూస్తున్నాడా? ఏడీ? ఆయన్ను తనివితీరా చూడాలి. తను చచ్చిపోయినా ఫరవాలేదు తను తెగిన గాలిపటంలా నశించిపోదు. భర్త చేతుల్లో చచ్చిపోతుంది. పసుపు కుంకుమతోనే వెళ్ళిపోతుంది. అనుకోగానే మనసు తేలికపడింది. కళ్లు తెరిచింది ఎదురుగా ప్రభాకరం కూచున్నాడు.

"ఏమండీ!" పిలిచింది. కన్నీళ్ళు కారుతున్నాయి. పెదాలు వణుకుతున్నాయి "మీరు నన్ను తాకారు ఈ శరీరం పులినమయిపోయింది. నేను పనికిరానండీ" అని బావురుమంది

"ఏడవకు రేవతీ!"

"నేను చెయ్యరాని పని చేశానండీ మీరు నన్ను క్షమించానంటే హాయిగా చచ్చిపోతాను'" మళ్ళీ బావురుమంది

"వూరుకో రేవతీ! బాధపడకు."

ఇంత విశాల హృదయుడినా నేను మోసగించింది—అన్న భావం రేవతి హృదయాన్ని బద్దలు చేసింది. పిచ్చిదానిలా భర్త కాళ్ళమీద పడిపోయింది. పగిలిన రేవతి గుండె తిరిగి కొట్టుకోనేలేదు. *



# "ఉపాయం"

భగవంతరావు కొడుకు ధైర్యం చేశాడు.

భగవంతరావు ఆఫీసు నుంచి జీతం అందుకుని వచ్చి, చొక్కా విప్పి వంకీకి తగిలించి, స్నానం గదిలోకి వెళ్ళగానే, తండ్రి చొక్కాలోంచి పర్స్ తీశాడు. తెరచి లెక్కపెట్టాడు. ఆరు వంద రూపాయల నోట్లు, కొంత చిల్లర నోట్లు. రెండు 'వంద' రూపాయల నోట్లు తీసి జేబులో వేసుకుని ఆ పర్స్‌ని కూడా తన జేబులోనే వేసుకున్నాడు

స్నానం ముగించి సంధ్య వార్చాక ఇంటాయనకి అద్దె ఇవ్వడానికి చొక్కా జేబులు, పేంట్ జేబులు వెదికాడు పర్స్ కోసం జీతంతో నిండిన పర్స్ కనబడలేదు. మాయమయింది!

ఇంటికి వచ్చేదాకా అది జేబులోనే వున్నట్లు గుర్తు భగవంతరావుకి ఆ తర్వాత ఆ ఇంట్లో గంటదాకా అరుపులు అనుమానాలు, కన్నీళ్ళు.

భగవంతరావు కొడుకు మర్నాడు వుదయం తనకు ప్రాణమిత్రుడయిన ఓ పోలీస్ కాన్‌స్టేబుల్ దగ్గరికి వెళ్ళాడు.

"చిన్న సహాయం చేయాలి గురూ!" అన్నాడు తండ్రి జేబులోంచి దొంగిలించిన పర్స్‌ని కాన్‌స్టేబుల్‌కిచ్చి, ఓ పావు గంటసేపు విడమరిచి చెప్పాడు ఆ సాయంత్రం కాన్‌స్టేబుల్ ఏం చేయాలో.

కాన్‌స్టేబుల్ పర్స్ తెరిచి, "నాలుగు వందల అరవై చిల్లర వుంది. నువ్వు రెండు వందలు కాజేశావా?"

"మా నాన్నలా గుర్రప్పందాలకి తగలెయ్యను. మా అమ్మ చాలా రోజుల నుంచి ముచ్చటపడుతున్న, తాకట్టులో వున్న బంగారపు గొలుసు విడిపిస్తానంతే."

ఆ సాయంత్రం భగవంతరావు దగ్గరకి వచ్చి అడిగాడు కాన్‌స్టేబుల్ "భగవంతరావుగారుండేది ఇక్కడేనా?"

"అవునుఏం" అన్నాడు భగవంతరావు.

"మీ వస్తువేదయినా పోయిందా?"

"పర్స్ పోయింది. దాంట్లో ఆరువందల అరవై దాకా వుండాలి. మీగ్గాని దొరికిందా?" అడిగాడు భగవంతరావు.

తల వూపి చెప్పాడు పోలీస్ కాన్‌స్టేబుల్ తన మామూలు ధోరణిలో "నిన్న బస్‌లో జేబులో కొట్టే పిక్‌పాకెటర్‌ని పట్టుకుంటే అయిదారు పర్సులు దొరికాయి. ఒకటి మీది ఎవరివి వాళ్ళకి అందచేస్తున్నాం. ఎంత వుందన్నారు పర్సులో?"

"ఆరువందల అరవై."

"మీరు దురదృష్టవంతులు. అదృష్టవంతులు కూడా రెండూనూ. రెండు వందలు ఖర్చుపెట్టేశానని చెప్పాడు. నాలుగువందలఅరవై మిగిలి వుంది. చూసుకోండి" అందించాడు పర్స్‌ని

భగవంతరావు లెక్కపెట్టి తృప్తిగా నిట్టూర్చి, ఆ కాన్‌స్టేబుల్‌కి బహుమతిగా ఇరవై రూపాయలు ఇచ్చాడు.

తను రేసుల్లో ఖర్చుచేయదలచుకున్న రెండువందలు పోయినా, ఇంటి ఖర్చుకు సరిపడే నాలుగువందల అరవై రెండు రూపాయలు లభించడంతో ఏనుగెక్కినంత సంతోషపడ్డాడు భగవంతరావు. రెండు రోజుల తర్వాత ఆ బంగారు గొలుసు విడిపించాడు భగవంతరావు కొడుకు—తను దాచుకున్న డబ్బుతో.

—మల్లాది వెంకటకృష్ణమూర్తి

# మిస్టర్ సంపత్ ఎం.ఏ.

మాదిరెడ్డి సులోచన

## జరిగిన కథ

ఆదర్శాలకూ, అవసరాలకూ జరుగుతున్న పోరాటంలో అవసరాలదే పైచేయి అని భావించక తప్పని పరిస్థితులలో చిక్కుకున్నాడు సంపత్ కుమార్. ప్రేమించిన సునీతి అపార్థం చేసుకుంది. సునీతి తండ్రి శివరాజు గారి బాకీ వెంటనే కట్టవలసి వచ్చింది. తల్లి అనారోగ్యం ఆందోళన కలిగిస్తూంది. న్యాయమార్గాన సంపాదన కోసం ప్రయత్నించి పరాజితుడవుతున్నాడు సంపత్. శివరాజుగారు పక్షవాతంతో మంచాన పడ్డారు. ఆయన కుటుంబం హఠాత్తుగా సంక్షోభానికి లోనైంది. అవసరాలకు లొంగాడు సంపత్. 'మేల్ ప్రాస్టిట్యూట్'గా తయారయేందుకు కూడా సిద్ధమై అస్తానా దగ్గర ఉద్యోగానికి చేరాడు. ఒకరోజు చాలామంది హైసొసైటీ యువతుల కోర్కె తీర్చేందుకు వారిముందు నగ్నంగా నిలబడేందుకు సిద్ధమయ్యాడు. ఆ దుస్థితినుండి సీత కాపాడింది. సంపత్ తల్లి మరణించింది. సీత అండగా నిలిచిందతనికి. సునీతికీ సంపత్ కూ మధ్య దూరం పెరిగిపోతోంది. తన మాట కాదన్నందుకు అస్తానా సంపత్ ను బెదిరించాడు. సీత సహకారంతో పెద్ద బిజినెస్ మాన్ అయ్యాడు సంపత్. సీత భర్త గుప్తాకు కంటగింపుగా వుంది సంపత్ ను చూస్తే. సునీతి కుటుంబం ఆర్థికంగా అస్తవ్యస్థమైన స్థితిలో పడింది. సంపత్ తెలివితేటలతో వ్యాపారాన్ని అమిత వేగంగా వృద్ధిపరచాడు. గుప్తా స్వంత ప్రయోజనాలకోసం తమ వ్యాపారసంస్థను అప్రతిష్టపాలు చెయ్యడం సహించలేక అతన్ని వ్యాపార బాధ్యతల నుంచి తొలగించాడు సంపత్. గుప్త సీత దగ్గర మండిపడ్డాడు. తప్పని పరిస్థితిలో సునీతి ఇల్లు వేలం వెయ్యబడింది. సంపత్ ఆ ఇంటిని వేలంలో పాడి శివరాజుగారి పేర రాయించాడు. సునీతితో సఖ్యంగా మాట్లాడుదామని అతను చేసిన ప్రయత్నం విఫలమయింది. ఎలాగైనా సంపత్ ను వివాహానికి వప్పించాలని సీత చేసిన ప్రయత్నాలు ఫలించడంలేదు. శర్మ అనే వ్యాపారస్థుడి బిస్కట్ల కంపెనీ సంపత్ నే తీసుకోమని రికమండ్ చేయడానికి వెళ్ళిన సీత, ఆ బిస్కట్లలో కల్తీవల్ల ఎందరో పిల్లలు అనారోగ్యవంతులయిన విషయం తెలుసుకొని అప్ సెట్ అయింది.

"నో. నో—డాక్టర్ మాకు శ్రేయోభి లాషులున్నారని అనుకోను, దయచేసి ఎవరో చెప్పండి"

"మానాన్నే నాది పాపిష్టి డబ్బు వద్దని ఉంటారు కదూ! ప్లీజ్ చెప్పండి డాక్టర్ "

"కాదు. కొన్నాళ్ళ క్రితం మిస్టర్ సంపత్. ప్రొప్రయిటర్ సంపత్ షిప్పింగ్ కంపెనీ వచ్చి, యెంత ఖర్చయినా మీ నాన్నగార్కి ట్రీట్‌మెంటు చెయ్యమనీ బిల్స్ అన్నీ వారే ఇస్తామన్నారు, ఇచ్చారు కూడాను "

"డాక్టర్!" సునీతి ముఖం తెల్లగా పాలిపోయింది.

"యస్ మిస్ సునీతి. మీరు కావల సిన వారని కొన్ని కారణాల వల్ల మన స్పర్థలు వచ్చాయని, త్వరలో అన్ని సర్దుకోవచ్చని చెప్పాడు" సునీతి మాటలు రానట్టు వింటూ కూర్చుంది

"మళ్లీ ఏమయినా కాంప్లికేషన్స్ ఉంటే తీసుకురండి." ఇక మీరు వెళ్ళ వచ్చు అన్న మాట ధ్వనించింది అతని కంఠంలో. నిద్రావస్తలో నడిచినట్టు నడి చింది. వచ్చేటప్పుడున్న, ఠీవి గర్వము మాయమయ్యాయి, మనసంతా అల్ల కల్లోలమయింది. తను యెందుకయితే ఈ వివాహానికి అంగీకరించిందో అది వ్యర్థం అని తేలిపోయింది తండ్రికి దొరి కిన ఉద్యోగము అతని పరపతి వల్లేనని తెలిసిపోయింది ఇంత కంటే చావు నయం.

మెల్లగా నడుస్తూనే ఇల్లు చేరింది. ఇంటి అరుగు మీద కూర్చుని బన్ను ముక్కలు కాగితంలో పోసుకుని, టీలో ముంచుకుని తింటున్నాడు శివరాజు

అసలే వికలమయిన మనసుతో ఉందేమో, అందులో తండ్రి అలా తినటం చూడగానే అగ్గిలో ఆజ్యం పోసి నట్టు అయింది.

"నాన్నా? ఏమిటిః"

"కనిపించటంలే, ఇది రొట్టె. ఇది టీ కడుపు నింపకోటానికేదో కావాలి కదా, ఆహా .విషయము చెబుతున్నాను" అన్నాడు అతని మూతి వంకరగా ఉండి వికృతంగా కనిపిస్తున్నాడు.

"ఎవర్ని సాధించాలని ఈ పంతం?" ఉక్రోషంగా అడిగింది

"యెవర్నీ సాధించాలని కాదు, అనా లోచితంగా చేసిన నా తప్పులకు పశ్చా త్తాప పడదామని " అన్నాడు నింపా దిగా

"నాన్నా! ఎందుకీ గొడవః మీ చేత్తో ఇంత విషం ఇవ్వండి " ఏడ్పు వచ్చే స్తుంటే బలవంతంగా నిగ్రహించుకుంది.

"ఆ మాటే నేను అడుగుదామను కుంటున్నాను నాకు ఇంత విషమిచ్చి నువ్వు వివాహం చేసుకున్నా, విచ్చల విడిగా తిరిగినా పరవాలేదు," అన్నాడు.

"నాన్నా! దయచేసి నన్నర్థం

చేసుకో " బ్రతిమాలే ధోరణిలో అన్నా. కంఠం కరుగ్గానే ఉంది.

"విషయము చెబుతున్నాను. మనము జీవితాలనే అర్థం చేసుకోలేదమ్మా" అన్నాడు గ్లాసులో మిగిలిపోయిన టీ తాగుతూ

"నేను వండింది మీరు తినరన్న మాట!"

"నువ్వయినా యెన్నాళ్ళు వండి పెడతావు! పెళ్ళి కాగానే వెళ్ళిపోతావు. ఇప్పటి నుండే బన్నులు, పండ్లు దొరికింది తినటం నేర్చుకుంటాను నా కొచ్చే జీతంలో నేను తినగల్గేది అంతే."

సునీతికి మండిపోయింది

"జీతం జీతం అని మురిసిపోతున్నావు అది యెవరివల్ల వచ్చిందో తెలుసా?"

"నీవల్ల రాలేదని తెలుసు అక్కడ సంపత్‌ను రెండు, మూడు సార్లు చూచాను అతనేమయినా రికమెండేషన్ ఛేశాడేమో " అన్నాడు నింపాదిగా

"సంపత్ సహాయం చేస్తే పరవాలేదా?" రోషంగా అడిగింది.

"అతను నన్నేమన్నాడని? నా అన్యాయాలు అరికట్టాలని ప్రయత్నించాడు. అంగవైకల్యంతో బాధపడుతూ ఆత్మ పరిశీలన చేసుకున్నాను నా కళ్ళముందే కత్తి మందుతో బాధపడేవారిని చూచాను నాదే తప్పని అర్థం అయింది. ఇప్పుడు నా కెవరిమీదా కోపం లేదు. నాపై నాకే కోపం వస్తుంది. మనం ఏం చేస్తున్నామన్న విషయము ఎప్పుడూ మననము చేసుకోవాలి. అది నేను చేయలేదు. అహా విషయము చెబుతున్నాను" అతి ప్రశాంతంగా, చెప్పాడు.

"నా న్నా " అని మాత్రం అనగల్గింది. ఏమనగలదు? శక్తి హరించుకుపోయినట్టు కూర్చుండి పోయింది.

"వెళ్ళు ఆలస్యం అయింది భోజనం చెయ్యి" అన్నాడు అతనే చివరకు.

"నాన్నా! దయచేసి ఆ ఉద్యోగం వదిలి వేయి. నీకు మళ్ళీ స్ట్రోక్ వస్తే నేను భరించలేను "

"నేను ఉద్యోగం మానేస్తాను. ఎప్పుడో తెలుసా? నీవు నాయుడుతో వివాహం రద్దు చేసుకున్నప్పుడు."

"అది జరగని పని నాన్నా!"

"ఇదీ జరగని పనే " అతను మెల్లగా, ఉన్న ఒక్క చేత్తో గోడ ఆసరాగా చేసుకుని లోపలికి వెళ్ళి, తన మంచంపై ముడుచుకుని పడుకున్నాడు. సునీతికి భోజనము చేయాలనిపించలేదు నమ్మించి మోసం చేయగలదా? నాయుడు దగ్గర డబ్బు తీసుకుని అప్పులన్నీ తీర్చి వేసుకుంది అతడిని కాదని తను బ్రతకటం కూడా కష్టమే. ముఖ్యంగా రోజూ సంపత్‌ను చూస్తూ ఉండలేదు ఎలా, ఎలా? తల్లిని అంతగా అభిమానించలేదు. తండ్రి అంటే సునీతికి ప్రాణము ఆ తండ్రే ఆమెను అసహ్యించుకున్నాడంటే, యెలా భరించాలో తెలియలేదు వెళ్ళి బట్టలు మార్చుకుని, మంచినీళ్ళు తాగి పడుకుంది.

సునీతి ఆఫీసుకు వెళ్ళేసరికి సంపత్ వచ్చినట్టున్నాడు. అందరూ హడావుడిగా



తిరుగుతున్నారు. ఆమె కూడా ఒకసారి విష్ చేద్దామని అతని గదిలోకి వెళ్ళింది. ఆమెను యెన్నో ఊహలు చుట్టూ ముట్టాయి. అతను తన వంక ఆశ్చర్యంగా చూస్తాడు, ఇంకా ఉన్నావా అని తప్పక ప్రశ్నిస్తాడు అనుకుంది

"గుడ్‌మార్నింగ్ మిస్ సునీతి ఈ ఉత్తరం వచ్చి వారం రోజులయింది మీరు రిప్లై ఇవ్వలేదు"

"స్టాక్ గురించి నాకు స్పష్టంగా తెలియదు" అన్నది.

"మేనేజర్‌ను అడిగితే చెప్పేవాడు ఇప్పుడే పంపండి" అన్నాడు

ఆమె నోటుబుక్కు, పెన్సిల్ పట్టుకుని కూర్చుంది

"జస్ట్ ఎ మినిట్, మిస్టర్ రాహుల్, మీరు రేపు సాయంత్రం రండి"

ఎదురుగా కూర్చున్న వ్యక్తి లేచిపోయాడు. సునీతి అలర్ట్ అయింది. ఫోన్ మోగింది.

"హల్లో మార్నింగ్ ప్లైటులో వచ్చాను సారీ ఈ పూట తీరిక అసలే లేదు దట్స్ ఆల్‌రైట్ ఒకే" ఫోన్ పెట్టేశాడు.

వడగళ్ళ వానలా ఉన్నాయి ఫోన్ కాల్స్ అతను వాటికి జవాబులు చెబుతూనే సునీతికి డిక్టేట్ చేశాడు. ఆరు గంటలవరకు ఆఫీసులోనే ఉంది, అతను పైకి తన రెసిడెన్స్‌లోకి వెళ్ళిపోయాడు. స్టాఫంతా అప్పుడే కాళ్ళు వచ్చినట్టు బిలబిలమంటూ వెళ్ళిపోయారు సునీతి బ్యాగు సర్దుకుని లేచింది నాయుడు చెప్పిన విషయాలు గుర్తుకు వచ్చాయి. శుభస్య శీఘ్రం: త్వరగా సంపత్ విలువయిన డాక్యుమెంట్స్ దాచే బీరువా తాళం తీసి, పై అరలోని కాగితాలన్నీ ఒక్కొక్కటే తీసి చూడసాగింది బయట ఆఫీసుకు తాళాలు వేసి అందరూ వెళ్ళిపోతారు. ఆమె గదికి బయటకు వెళ్ళటానికి సంపత్ గదిలోనుండి. అతని

మేడ కాంపౌండులోకి ఓదారి వుంది. అప్పుడప్పుడు ఓవర్ టైమ్ చేసి, రెండో గుమ్మం గుండా వెళ్ళటం ఆమె కలవాటే. అందుకే నిర్భయంగా ఫైళ్ళు వెతికింది. పై అరలో ఆన్నీ సంపత్ షిప్పింగ్ కంపెనీకి సంబంధించిన పార్టనర్‌షిప్ డీడ్స్ ఉన్నాయి. ఆమెకు తెలిసినంత వరకు అందులో లూప్‌హోల్స్ యెక్కడా కనబడలేదు. అవసరమయితే ఆ ఫైళ్ళ నకళ్ళు తీయాలి. నాయుడికి అర్థం అవుతా యేమో! తన తండ్రి అవమానించి, ఈ నాడు తము ఇంత దిగజారి పోవడానికి కారకుడయిన సంపత్ యెంత త్వరగా బజార్లో పడితే, తన హృదయములో నిరంతరం రగిలే కారుచిచ్చు చల్లారి పోతుంది. రోజూ కొన్ని ఫైళ్ళ చొప్పున సంపత్‌కు అనుమానం రాకుండా వెత కాలి. ఆమె బీరువాకు తాళం వేసి వెను తిరిగింది రాయిలా ఉన్న చోటే నిలబడి పోయింది · సంపత్ యెప్పుడు వచ్చాడో చేతులు కట్టుకుని గుమ్మములో నిల్చు న్నాడు ఆమె ఒళ్ళంతా చమట పట్టింది.

"మీకు కావల్సిన కాగితాలు ఏమయినా దొరికాయా సునీత్?"

"ఆ ఆఁ అగల్‌వాల్...అమృత్ లాల్ కంపనీ వాళ్ళ ఉత్తరం రసీదు కోసం " తడబడిపోయింది.

"దేనికి వెతుకుతున్నావని నేను ఆడగ లేదే? మీకు కావల్సిన కాగితం దొరి కిందా?"

"ఉహూఁ. " తల అడ్డంగా తిప్పింది.

"చాలా రాత్రయింది ఇంటికి వెళ్ళి పొండి. నాయుడుగారికి ఏదయినా ఇన్ఫర్ మేషన్ ఇవ్వాలనుకుంటే, ఫోన్ చేయండి ఈ సమయంలో అతను మనిషి కాడు. అతనొక్కడే ఉంటే పర్వాలేదు. అతని స్నేహబృందం అంతా ఉంటారు "

"ఊఁ " నోరు యెవరో నొక్కేసి నట్టు ఉందామె పరిస్థితి ఎన్నో అనాలని, తను ఉదయం తెచ్చిన డబ్బు అతనికి ఇవ్వాలని ఉంది కాని ఏది చెయ్యలేక పోయింది

"వెడతారా డ్రాప్ చెయ్యమంటారా?"

"వెడతాను " చివరకు ఆ ఒక్క మాట అనగల్గింది.

అతను బయటికి వెళ్ళి, మాలిని పంపి ఆటో రిక్షా తెప్పించాడు. మౌనంగా యెక్కింది

"గుడ్ నైట్!" అతను నవ్వుతూ చెయ్యూపుతుంటే ఒంటికి భారం రాసు కున్నట్టు అయింది

"నైట్ " ఆటో వెళ్ళిపోతుం డగా సీత కారొచ్చింది ఆమె కార్లోనుండే ఆటోలో వెళ్ళే సునీతిని చూచింది.

"ఎందుకొచ్చింది?"

"ఆమె నా దగ్గర పని చేస్తుంది, ఓవర్ టైమ్ చేసింది" అన్నాడు నవ్వుతూ. ఇద్దరూ వెళ్ళి లాన్‌లో ఉన్న కుర్చీలలో కూర్చున్నారు

"సంపత్! నిజం చెప్పు, ఆ అమ్మాయి ఎందుకు వచ్చింది?"

"రాలేదు సీతా! ఆఫీసులో ఉన్నది "

"ఇంకా నీ దగ్గర పని చేయడం ఆశ్చర్యంగా లేదూ?"

"ఆశ్చర్యం ఎందుకు? నా అంతు చూడాలని నాయుడు, గుప్త కంకణం

కట్టుకున్నారు. ఆమె నా వ్యాపారంలో లూజ్ పోల్స్ వెతకటానికి ఉన్నది."

"అది తెలిశాక గెంటివేయక ఉంచుకున్నావేం?" కోపంగా అరిచింది సీత

"ఒక ఆడదానికి భయపడి, తరిమేటంత పిరికివాడు కాడీ సంపత్ ఆ విషయాలు పోనీ, పిల్లలేరీ?"

"వాళ్ళకు నిదుర సమయము. సంపత్ ఈసారి నా మాట వినకపోతే నీకు, నాకు రామ్, రామే " అన్నది నిష్ఠూరంగా

"మాట ఏమిటో చెప్పు ఆ... నాకు నిద్రొస్తూంది." అవులించి చిటికె వేశాడు.

"నేను పెళ్ళిమాట యెత్తుతానని తెలిస్తే చాలు. ఎక్కడ లేని నిదుర వస్తుంది రేపు మునుగాల జమీందారు గారొస్తున్నారు. వాళ్ళమ్మాయి అయిర్లండులో చదువు ముగించి వచ్చింది. సునీతి కంటే ఎన్నో రెట్లు అందంగా ఉంటుంది." అన్నది

"ఊఁ "

"ఊఁ లేదు, ఆఁ లేదు. నువ్వు నా మంచితనమే చూచావ్. నేను చాలా మొండిదాన్ని అన్నంత పనీ చేస్తాను "

"సీతా! నేను సుఖంగా ఉండటం ఇష్టంలేదా?"

"సుఖం! సంపత్' మనిషికి ఒక తోడంటూ ఉండాలి లైంగిక వాంఛలు తీర్చుకోవటానికే కాదు తోడు అంటే, కష్టసుఖాలు చర్చించుకున్నా, కనీసం దెబ్బలాడుకున్నా, జీవితానికో పరిపూర్ణత్వం ఉంటుంది ఎన్ని సుఖాలున్నా ఒంటరితనమంత ప్రమాదమయిన జబ్బు మరొకటి లేదు." అన్నది.

"సరే చూద్దాం."

"చూద్దాం అంటే కుదరదు అబ్బాయ్! రేపు లంచ్ అక్కడే " ఆమె లేచింది

ఆమెను సాగనంపి వచ్చి, ఒక్కడే పేక ముక్కలు కలిపివేస్తూ, తీస్తూ కూర్చున్నాడు "ప్రేమించిన హృదయమే ద్వేషించగలదన్న" సూక్తి గుర్తుకుతెచ్చుకుని నవ్వుకున్నాడు అర్ధరాత్రి దాటాక నిదురబోయాడు.

నౌకరు వచ్చి లేపేవరకు లేవనే లేదు. ఎనిమిది దాటాక అతను మరోసారి లేపితే లేచాడు అతను బ్రష్పై పేస్ట్‌వేసి తెచ్చి ఇచ్చాడు దూరంగా పడిపోయిన బాత్ రూమ్ స్లిప్పర్లు తెచ్చిపెట్టాడు.

"ఆఫీసులో పనిజేసే అమ్మ వచ్చింది దొరా" అన్నాడు. ఆఫీసులో సునీతి తప్ప అమ్మలెవరూ లేరు. త్వరగా బట్టలు మార్చుకుని, ముఖం కడిగి హాల్లోకి వచ్చాడు

"గుడ్ మార్నింగ్" లేచి నిల్చుంది

"మార్నింగ్!" వెళ్ళి ఆమె ఎదురుగా కూర్చున్నాడు

"టైమ్‌లీ హెల్ప్‌కి చాలా థాంక్స్. డాక్టరు రెడ్డిగారి కిచ్చిన డబ్బు ఇచ్చి పోదామని వచ్చాను" పర్స్ తీసి నోట్లకట్టలు బల్లమీద పెట్టింది

"థాంక్స్! అని అవి ముట్టుకోనయినా లేదు. ఇంతలో నౌకరు టీ తెచ్చాడు అతనామె వంక పరీక్షగా చూశాడు. రాత్రంతా నిదురబోలేదని ఆ కళ్ళను చూస్తేనే తెలుస్తుంది.

"టీ తీసుకోండి." ఈసారి కఠినంగా

ఉండలేక పోయాడు. ఆమె కాదనలేక పోయింది ఇద్దరూ టీ త్రాగారు.

"మీకు ఒక్క విషయము చెబుతాను వింటారా!" సంపత్ అడిగాడు.

"చెప్పండి " అన్నది ఆసక్తిగా.

"నాయుడు దృష్టిలో స్త్రీకి, చొక్కాకి పెద్దగా భేదం లేదు "

"అది నా స్వవిషయం " ముఖం ఎఱ్ఱబడింది.

"మీ స్వవిషయమే కాదనను, కాని దాన్ని మీరు బలవంతంగా నాకు అంట గడుతున్నారు " అతను లేచాడు. కోపంతో అతని కండరాలు బిగుసు కున్నాయి.

"మీతో ఏం లింకు పెట్టాను?" అంత కంటే కోపంగా అరిచింది.

"ప్రతి క్షణం నా అంతు చూడాలనే కదూ,నీ తపన! చూడు సునీతి నీకెప్పుడూ తొందరేగాని విచక్షణ లేదు. నేను నీకు చేసిన అవమాన మేమిటి అపకార మేమిటి? ఈ దొంగ నోట్లు ఇచ్చావు సరే. నాకు డబ్బుంది. కావాలంటే ఈ విషవలయము నుండి తప్పించుకుని, అది తిరిగి నీనెత్తిన రుద్దగలను కాని ఆ డబ్బులో మిగిలిన డబ్బు నీ దగ్గర పట్టుబడితే బ్రహ్మ దేవుడు కూడా రక్షించలేడు."

"అవి దొంగనోట్లా!" గొంతు తడి ఆరిపోయింది.

"అనుమానంగా ఉంటే ఒక గంట ఇక్కడే కూర్చో తేలిపోతుంది."

"కాదు కాదు " అపనమ్మకంగా అన్నది. కాని ఆమెకు జరిగింది గుర్తుకు వచ్చింది.

రాత్రి నాయుడు కారు పంపితే వెళ్ళ లేదు. ఉదయమే వెళ్ళి, సంపత్ డాక్టరుకు డబ్బు చెల్లించిన విషయము చెప్పింది, ఆ డబ్బు సంపత్‌కు ఇస్తానంది. అతను చిన్నగా నవ్వి 'పిట్ట చిక్కింది' అని చిటికె వేశాడు

"అతనికి లేబర్‌కు ఇవ్వటానికి కేష్ కావాలి. ఒక్కొక్క రూపాయి నోట్లు తీసుకుపో " అంతకు ముందు ఇచ్చిన వంద రూపాయ నోట్లు తీసుకున్నాడు. ఒక్కొక్క రూపాయివి ఇచ్చాడు

"అతను దయతలచి ఇచ్చిన సొమ్ము మనకెందుకు ఇచ్చిరా యెంతో మందికి సాయము చేసిన ఈ నాయుడు స్వంత మామకు చేసుకోడా!" అన్నాడు. సునీతి డబ్బు తీసుకుని లేచి రాత్రి తను బీరువాలు వెతుకుతుండగా సంపత్ చూశాడని చెప్పాలా, వద్దా అని తటపటాయించింది, చెబితే అతను ఆమె అసమర్ధతను అప హాస్యం చేస్తాడని తెలుసు. అందుకే సంపత్ చూచాడన్న విషయం వదిలింది.

"పైన అర అంతా గాలించాను అక్కడ నాకు ఇల్లీగల్‌గా ఏం కనిపించ లేదు " అన్నది.

"బిజినెస్ డీడ్స్ నీకు తెలుస్తాయా?"

"తెలిసినంతవరకు ప్రయత్నించాను. వాటిని కాపీలు చేసి తెస్తాను కాస్త టైమ్ తీసుకుంటుంది " అన్నది

"గుడ్! అంత అవసరం రాలేదేమో డబ్బిస్తూనే నువ్వు వచ్చేయాలి సుమా " అన్నాడు. అదంతా గుర్తుకు వచ్చి ఆమె ముఖం పాలిపోయింది.

"ఆల్ రైట్! సంపత్ నాయుడు





లాంటి వెర్రికుక్కలకు భయపడతాడో తప్పించుకుంటాడో చూడు. ఊఁ మీ నాయుడుకి ఫోన్ చేయి, ఇంటికి వెడుతున్నానని డబ్బిచ్చేశానని "సునీతి అయోమయంగా చూచింది

"కుతూహలం కొద్ది చెబుతున్నాను. మీరు వేసిన ప్లాను యెలా భంగమవుతుందో." అతను హేళనగా నవ్వాడు. నౌకరు టీ సరంజామా తీయటానికి వచ్చాడు

"ఆ ఫోన్ అమ్మగారి దగ్గరగా జరుపు " అని, అతను బాత్ రూం వైపు వెళ్లాడు

ఆ నోట్లు విషసర్పాలయి తనను కాటు వేస్తున్నట్టు, భయంగా చూచింది. నౌకర్ ఫోన్ దగ్గరగా తెచ్చాడు. యాంత్రికంగా నాయుడు నంబర్ తిప్పింది.

"హల్లో సునీతిని " అన్నది. అవతల నుండి నాయుడు ఎత్తాడు ఫోన్. "నా గొంతుకేం బావుంది నే నింటికి వెళ్ళి తరువాత వస్తాను ...ఆ కాస్త నలతగానే ఉంది . తీసుకున్నారు ఏం చేస్తారో మరి ఉంటాను " ఫోన్ టక్కున పెట్టింది ఆమెకు చెమటలు పట్టాయి. అలాగే బొమ్మలా కూర్చుంది సంపత్ పై కట్టుకుంటూ బయటికి వచ్చాడు. నోట్లు తీసుకుని జేబులో వేసుకుని క్రిందికి దిగాడు. అతని గొంతు ఇంటి వెనుక వైపునుండి వినిపించింది ఆ నోట్లు డ్రైవర్‌కిచ్చి, నాయుడు దగ్గరకు పంపడు కదా' లేచి వెనుక వైపు బాల్కనీలోకి వెళ్ళింది. మాలి ఊడ్చిన ఆకులు పోగుచేశాడు. సంపత్ యేదో అన్నాడు. మాలి రుమాలులో దాచిన అగ్గిపెట్టె తీపి వెలిగించి యెండుటాకులు అంటించాడు. షావల్ తీసుకుని ఆకులు దగ్గరగా నెడుతున్నాడు సంపత్ నోట్లు తీపి ఒక్కొక్క కట్టనే మండుతున్న మంటలో వేశాడు. నెమ్మదిగా వెను తిరిగాడు.

సునీతి వచ్చి యథాస్థానములో కూర్చుంది. అతను పైకి వచ్చాడు. చేతులకేదో మురికి అంటినట్టు కడుక్కున్నాడు.

"మీరు ఫలహారం చేస్తారా?"

ఏమనక లేచి వచ్చి డైనింగ్ టేబుల్ రెండో వైపు కూర్చుంది. అతను వచ్చి అటు ప్రక్కగా కూర్చున్నాడు

"మిస్ సునీతీ! ప్రేమకు ద్వేషమే కాదు తోడు త్యాగం కూడా అన్న సంగతి తెలుసు. అందుకే కేసు నా మీదికి రాకుండా చూసుకున్నాను. నీ మెడకు తగిలించాలంటే నిముషం పట్టదు." అన్నాడు. వంటవాడు ఫలహారం తెచ్చాడు. ఆడంబరాలు, అతిశయాలు లేవు. ఒక్క చపాతీ, ఆమ్లెట్టు అతని ఫలహారము. అదే ఆమెకు పెట్టాడు. సునీతికి ఒక్కసారి అనసూయమ్మ, ఆమె యెంతో ప్రీతిగా కొడుకు కోసం చపాతీలు చేయటం గుర్తుకు వచ్చింది.

అతను తిని హార్లిక్స్ త్రాగుతుండగానే ఇద్దరు సి ఐ.డి. డిపార్ట్ మెంటువారు వచ్చారు. నమస్కారాలు, కాఫీలు అయ్యాయి.

"మిస్టర్ సంపత్ సారీ టు ట్రబుల్ యు ." నసిగాడు.

"చెప్పండి." అన్నాడు నవ్వుతూ.

"మీ ఇల్లు సోదా చేయాలి."

"విత్ ప్లెజర్! ఏ వ్యాపారస్తుడయినా కాస్త పేరు సంపాదిస్తే గవర్నమెంటు లిస్టులోకి, ప్రజల దృష్టిలోకి రాక తప్పదు." తన బీరువా తాళాలు తీసి వారికిచ్చాడు. ఒక గంటలో సోదా ముగిసింది.

"సారీ మిస్టర్ సంపత్ రాంగ్ ఇన్ఫర్మేషన్ . అందింది." అతను కూర్చున్నాడు.

"దొంగనోట్ల గురించి వచ్చిన ఇన్ఫర్మేషన్ అనుకుంటాను. నేను కరెక్టు ఇన్ఫర్మేషన్ ఇస్తాను. అసలు కథానాయకుడు దొరకడుగాని, అతని అనుచరులు ప్రెస్ దొరుకుతారు." వారికంతా అర్థం చేసి ఆ ప్రదేశం చేరుకునే ప్లాన్ అంతా గీసి ఇచ్చాడు.

సునీతి గాభరాగా చూచింది. వాళ్లు వెళ్ళిపోయారు. ఆమె లేచింది.

"మిస్ సునీతీ! పరువుగా ఇక్కడి నుండి బయట పడాలంటే నువ్వు నేరుగా ఆఫీసు రూమ్‌లో కెళ్ళి కూర్చో. నువ్వు ఫోన్ చేసినా,ఏది అయినా నాకు తెలుస్తుంది. ఇతరులను మూర్ఖులుగా అంచనా వెయ్యటంలో నాయుడు అఖండుడు. అతనే మూర్ఖుడు" అతనికి ఫోన్ రావటంతో హడావిడిగా వెళ్ళిపోయాడు..

## 36

నాయుడు కోపంతో ఊగిపోతున్నాడు. సునీతి చంపలు ఎఱ్ఱగా కందిపోయాయి. ఆమె మానసికంగా కృంగిపోయింది. ఈ దెబ్బలు అశానిపాతంలా తాకాయి.

చెంపలు తడుముకుంది.

"నేను ఇచ్చిన తరువాత అతనేం చేశాడో తెలియదు " అన్నది.

"అహ హ! బావుంది. ఇస్తే క్షణంలో రూపాయలు మింగేశాడా; యెక్కడో పారవేశావు." మరో వైపు నుండి గుప్త అరిచాడు.

"నిజం గుప్తాగారూ! నన్ను నమ్మండి."

"ఒక పని చేస్తే తప్పక నమ్ముతాము. అతన్ని హానరరి మెజస్ట్రేట్‌గా నామినేట్ చేశారని వార్త వచ్చింది. ఈలోపలే

అతని ఫైళ్ళన్నీ తిరగవేయాలి. సంపత్ ఎక్స్‌పోర్ట్ కంపనీ షేర్స విషయములో ఆబిద్ సీత వీడు గుస గుసలు పోవటం విన్నాను. అదేమిటో తెలియాలి. వీడి అంతు తేలాలి."

"అవును. అటు శర్మ బిస్కట్టు కంపెనీ మూల పడేయించాడు. ఇటు అస్తానాను బైటకు పంపాడు. మన నోట్ల యంత్రం స్వాధీనము చేసుకున్నాడు " కోపంగా ఒక చేతిలో మరో చేత్తో కొట్టుకున్నాడు, నాయుడు.

"విను సునీతీ, అతనికి నమ్మకం కల్గించి, నెల రోజులలో అతను జైలుకు వెళ్ళేలా చేయాలి. కాకపోతే అప్పుడు నీ బ్రతుకు బజార్లో పడుతుంది. నువ్వు యెందుకు కొరగాకుండా పోతావ్," గుప్త బెదిరింపుగా చూచాడు. కాబోయే భర్త నాయుడు అడ్డు వస్తాడనుకుంది. అతను మాట్లాడక కూర్చున్నాడు. అతని అభిప్రాయము అదేనన్నమాట. రోషంతో, కోపముతో ఆమె మనసు బుసలు కొడుతుంది. ఒక నాయుడు, గుప్తమీదే కాదు ఆమె మొగజాతిమీదే కసిగా ఉంది. ఆడదాన్ని ఆటబొమ్మ అనుకుంటారు.

"చూడు సునీతీ, నువ్వు అడిగింది యేదయినా కాదన్నానా?" దగ్గరగా వచ్చి ఆమె భుజం తట్టాడు.

"మీరు మాజీ ప్రేమికులని తెలిస్తే జాగ్రత్త పడే వాడిని.

అతని ప్రేమ నిన్ను అటులాగితే నాకోసం మరచిపో మనసు గట్టి చేసుకో."

"మిస్టర్ నాయుడూ! మీరు అను

---

## చరిత్ర

తవ్వకాలలో
బయటపడిన శిథిలాలు
మానవ చరిత్రను
చిత్రించాయి—
తవ్వే శ్రమ లేకుండానే
పొట్ట వెన్నుకూ
కళ్ళు కపాలానికీ
ఒకదాని కొకటి అంటుకుపోయి—
ఎక్స్‌రే లేకుండానే
ఎముకలను లెక్క వేయించుకునే
ఈ సజీవ శిథిలాల
విచిత్ర చరిత్ర
ఏ పుటలలో లిఖిస్తారు—?

—సుభాష్‌చంద్ర

---

కున్నట్టుగానే చూస్తారు. మిగతా విషయాలు వదిలి వేస్తే మీనుండి మాత్రం రుణవిముక్తురాలని కావాలి " చటుక్కున లేచింది.

"రుణాల ప్రసక్తి యెందుకు డాళింగ్ యు ఆర్ మై హాట్ అండ్ సోల్! అది కాక ఇప్పుడు నా సంపాదన పోయిందని యెందుకు తాపత్రయ పడుతున్నానో గ్రహించవేం? నీకోసం ..." అతని ఊపిరి ఆమె చంపలకు వెచ్చగా తగిలింది. ఆమె దూరం జరిగింది.

"ఇచ్చి పుచ్చుకునే వ్యవహారము దాంపత్య జీవితపు విలువల్ని కలుషితం చేస్తుంది. నేనొక పని చేయటానికి డబ్బు

ఇచ్చినట్టు మాట్లాడుతున్నారు. మామూలుగా నేను నాకాబోయే భర్త దగ్గర తీసుకున్నా ననుకున్నాను." లేచింది పర్స్ తీసుకుని బయలుదేరింది.

సునీతి సరాసరి సంపత్ ఇంటికి వచ్చింది. అతను లేడు. అక్కడేదో పార్టీ ముగిసినట్టు సరంజామా అంతా కనిపించింది. పనివారు హడావుడిగా తిరుగుతున్నారు. మిగిలిన వారంతా చాలా క్రమశిక్షణలో ఉంటారు. సీత ఇంట్లోనుండి సంపత్ ఇంట్లోకి వచ్చిన సూరి మాత్రం కాస్త అందరిలో చనువుగా అధికంగా మాట్లాడుతాడు.

"రండమ్మా అయ్యగారిప్పుడే వస్తారు." అతను కుర్చీ చూపించి ఫలహారము తెచ్చాడు.

"ఏదయినా పార్టీ జరిగిందా సూరీ?"

"మీకు తెలియదా? సెలవులో పున్నారు కదూ? అయ్యగారికి పెళ్ళి సంబంధం వచ్చింది."

"అయ్యగారికి పెళ్లా?" నోట్లో పెట్టుకోబోతున్న కాజా క్రింద పడిపోయింది.

"అవునమ్మా. మునగాల జమీందార్ల సంబంధం. అమ్మగారెంత బావున్నారని సీతమ్మగారి పనులన్నీ క్లాసుగానే ఉంటాయి."

"సీతమ్మగారు...సంబంధంచూశారా?"

"మరేమిటనుకున్నారు, లేకపోతే అయ్యగారు పెళ్ళి తనంతట తాను చూచుకున్నారా? మన గురించి ఆయన ఆలోచించనే, ఆలోచించరు " అన్నాడు. డెకోలామ్ స్టూల్‌పై మరకను తుడుస్తూ.

"నేను మరొక రకంగా విన్నానే.. " కుతూహలం లేనట్టు. ఆసక్తి కనబరిస్తే చెబుతాడో లేడోనని.

"ఏం విన్నారమ్మా?"

"సంపత్‌గారు, సీత భార్యా భర్తల్లా ఉంటారని "

ఛూత్? అన్నవారి నోరు పడిపోతుందమ్మా. అయ్య అగ్గి, అగ్గి ఆఁ నేను ఈనాడా వారిని చూచింది. ట్యూషన్‌కు వచ్చిన నాటినుంది యెరుగుదును "

"నీకేం తెలుస్తాయిలే పెద్దవారి వ్యవహారాలు:" అన్నది కవ్వింపుగా.

"ఆఫీసులుండె అమ్మో జాగ్రత్త. పెద్దోల్ల గోతాలన్నీ నా చేతులున్నాయి. ఆగుప్తగారు దరిద్రుడు. అందుకే సీతమ్మ చిన్న పోకడలు పోయిందేమో గాని సంపతయ్య, అగ్గి, అగ్గమ్మా ఆయానే సీతమ్మను మార్చి వేశాడు. లేకపోతే నాయుడయ్య ఇరవై నాల్గు గంటలు సీతమ్మ కాల్లకాడ పడివుంటూ, పనులు వెళ్ళదీసుకునే వాడు."

సునీతికి తల తిరిగిపోయింది. నాయుడు స్త్రీలోలుడని తెలుసు. సీతతో ఉండేవాడని మాత్రం తెలియదు. తింటున్న జహంగ్రీ చేదుగా అనిపించింది. ప్లేటు ప్రక్కన పెట్టేసింది.

"పెళ్ళి కుదిరిందా?"

"కుదిరినట్టే. వాళ్ళకు అన్ని విధాలా నచ్చాడు. ఇక అయ్యగారే ఊఁ అనాలి. ఆయనకు తీరిక లేదంటే అమ్మగార్ని తెచ్చి చూపారు "

"మీ అయ్యగారు ఊఁ అనేలా ఉన్నారా?" అన్నది. అతను ఎలా అంగీకరిస్తాడు? 'నువ్వు అంగీకరించలేదా?' అని మనసు నిలదీసింది.

"అనకేం జేస్తారు! అమ్మతో నవ్వుతూ మాట్లాడారు. ఫలహారం అందించారు. నాకు అర్థం కాలేదు ఇంగ్లీషులో కాకర, బీకర అనుకున్నారు. ఆయమ్మ పిగ్గుపడి. వచ్చి సీతమ్మతో ఏందో చెప్పింది. ఆమె నవ్వింది...." అతను చెప్పేవి ఒక్కటి వినిపించటం లేదు గతం .... తనూ, సంపత్ చెట్టాపట్టాలు వేసుకుని తిరగటం తీయని కలలు కనటం. చిలిపి తగువులతో, చిరుతిండ్లతో యెంత మధురంగా గడిచిందో! ఏ దేవతలు శపించారో! సూరి అన్నట్టు సీతతో అతనిది మామూలు స్నేహమేనా! మామూలు స్నేహమయితే అతన్ని అంతగా ఆరాధించి, ఈనాడున్న అంతస్తుకు చేర్చటం సాధ్యమా!

"హల్లో మిస్ సునీతీ! వేళకాని వేళ ప్పుడు వచ్చారు." సంపత్ వచ్చి కూర్చున్నాడు. తను లేవబోయిందల్లా అతను కూర్చోగానే తనూ కూర్చుంది.

"నేను మీతో, మీ ఆఫీసు స్టాఫ్‌గా కాక సునీతిగా కొన్ని విషయాలు మాట్లాడుదామని...."

"నిరభ్యంతరంగా మాట్లాడవచ్చు. సునీతిగా నువ్వు మాట్లాడటానికి వచ్చినా సంపత్‌గా వ్యక్తిగత విషయాలు మాట్లాడే సమయం కాదు. బాస్‌గా సానుభూతితో వినగలను. చేతనయిన సాయం చెయ్యగలను."

అతనంత నిర్మోహమాటంగా మాట్లాడుతుంటే ఆమెకు దుఃఖంవస్తుంది. అతి ప్రయత్నంమీద ఆపుకుంది. తను నటించాలి. తప్పదు. (సశేషం)

# ప్రజలు పిలిస్తే ప్రగతి వస్తుంది

ఇన్నాళ్లుగా సోషలిజం అనేది ఆకాశమంత ఎత్తున అంతంత మాత్రాన అందని ఆశయంగా మాత్రమే మనకు దూరంగా కనిపించి మురిపిస్తుండేది.

ఇప్పుడు దాన్ని భూమ్మీదకు తెచ్చుకున్నాం. ఇరవై సూత్రాల పథకంలోని అంశాలు అమలు జరిగిన కొద్దీ మనం సోషలిజానికి చాలా దగ్గరగా వెళ్ళగలుగుతాం.

దేశంలో దారిద్ర్యం, అవిద్య, అజ్ఞానం, మూఢ విశ్వాసాలు, స్వార్థం, స్వలాభాపేక్ష, అవినీతి, అక్రమ ద్రవ్యార్జన మొదలైనవి సమూలంగా నిర్మూలించ బడాలంటె ఇరవై సూత్రాల పథకం గట్టిగా అమలు పరచుకోవడం ఒక్కటే మార్గం.

దేశంలో ప్రతీపశక్తుల విశృంఖల విహారాన్ని అరికట్టడం ఎంత అవసరమో, పురోగమనానికి ఒక నిర్మాణ కార్యక్రమాన్ని అందించడం కూడా అంతే ముఖ్యం. అదే 20 సూత్రాల ఆర్థిక కార్యక్రమం.

ఆనాడు గాంధీజీ దేశంలోని పరిస్థితులకు అనుగుణంగా నిర్మాణ కార్యక్రమం రూపొందించారు. ఈనాటి మన నిర్మాణ కార్యక్రమం 20 సూత్రాల పథకం.

ఈ పథకం శ్రీమతి ఇందిరా గాంధీ ప్రతిపాదించినది కాదు. భారత ప్రజలందరూ కలిసి ప్రతిపాదించినది.

జాతీయ సమైక్యత, ఆర్థిక పురోగమనం, సోషలిజం మన ఆశయాలు. వీటికై నిరంతరం పాటుపడదాం.

---

సమాచార, పౌరసంబంధ శాఖ, హైదరాబాదు.

DIPR. 11/1976-77

# సినిమా

## ఝుమ్మంది నాదం!

గీతాకృష్ణా కంబైన్స్ సంస్థకోసం 'సిరిసిరి మువ్వ' చిత్రాన్ని తయారు చేశాడు దర్శకుడు కె విశ్వనాథ్ చాలా కాలంగా సంగీత నృత్య ప్రధానంగా ఒక చిత్రం తీయాలన్న సంకల్పం కలిగిన యీ దర్శకుడి కోరికకు రూపకల్పనగా సిరిసిరి మువ్వ నిలుస్తోంది. ఈ చిత్రంలో ఎనిమిది పాటలున్నాయి చిత్రంలోని ఆ పాటలు గల భాగాన్నంతా విలేఖరులకు ప్రత్యేకంగా చూపించారు నిర్మాతలు. ఆ పాటల్లో ఏముంది? మంచి సాహిత్యముంది (వేటూరి సుందరరామమూర్తి.) మధురమైనసంగీతముంది (కె.వి. మహదేవన్). అయస్కాంతంలా పాటవైపు మనను మళ్ళించే గాయనీ గాయకుల స్వర విన్యాసం ఉంది (ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం, సుశీల) వీటన్నిటికీ దీటుగా నేత్రపర్వం కల్గించేలా చక్కని కెమెరా పనితనము ఉంది (వి. యస్. ఆర్. స్వామి). చంద్రమోహన్, సత్యనారాయణ దేవదాసు, రమణమూర్తి, జయప్రద, రమాప్రభ, నిర్మల, ఫణి, కవిత మొదలైన వారు నటిస్తున్నారు ఈ చిత్రంలో. కర్రి అచ్చారెడ్డి, ఎన్. భాస్కర రెడ్డి, యు చినవీరరాజు నిర్మించే యీ చిత్రాన్ని చింతా రామకృష్ణా రెడ్డి సమర్పిస్తున్నారు.

## నిర్మాత దర్శకత్వం

యాంటీ ఫార్ములా చిత్రం 'తిరపతి' నిర్మించిన హనుమాన్ ప్రసాద్ 'దేవుడు చేసిన బొమ్మలు' చిత్రానికి దర్శకత్వం చేపట్టారిప్పుడు. 'పుట్టిన ప్రతి మనిషి

'సిరిసిరిమువ్వ'లో జయప్రద





'సుప్రభాతం'లో రమాప్రభ, వాణిశ్రీ

పుట్టించిన ఆ దేవుడి చేతిలో కీలుబొమ్మ' అన్న కథాంశంతో నిర్మితమైన ఈ చిత్రంలో మురళీ మోహన్, జయసుధ, గిరిబాబు, ప్రభ, చలం, అనిత, కొమ్మినేని శేషగిరిరావు, యం. రంగారావు, సాక్షి రంగారావు,కబీర్‌దాస్, కల్పనారాయ్ నటించారు. సత్యం సంగీతంతో వస్తున్న యీ చిత్రాన్ని బి. రామతారకం సమర్పిస్తున్నారు.

## క్రాంతికుమార్ కల్పన:

అంతర్జాతీయ మహిళా సంవత్సరం ముగిసింది. అంతర్జాతీయ మహిళా దశాబ్దం నడుస్తోంది. ఇంతవరకూ ఏ మహిళా సమాజమూ నిర్మాత క్రాంతి కుమార్‌కు సన్మానం తలపెట్టకపోవడం చిత్రమే మరి! చలనచిత్ర, నిర్మాతగా ఆయన ఇంతవరకూ తీసిన చిత్రాలన్నీ స్త్రీ సమస్యలను ప్రధానంగా తీసుకొన్నవే! మళ్ళీ ఇప్పుడు అదే చేస్తున్నాడీ నిర్మాత. 'ప్రతిస్త్రీ' తన భర్త జీవన ప్రాంగణంలో కరదీపికలా నిలిచి, రాగవల్లి దిద్దుకొని నవపల్లవ పల్లవి ఆలాపించాలని మధురోహలతో గుండె తడిపి తన వలపు తలపులతో హేమంతంలో వాసంతిలా నాట్యమాడాలని కలలు కంటుంది. అలా కలలు కంటున్న ఓఅమ్మాయి జీవితాన్ని ఇప్పుడు నేను నిర్మిస్తున్న చిత్రం 'కల్పన'కు కథగా ఎన్నుకొన్నాను అన్నారు క్రాంతి కుమార్ తన నూతన చిత్రం గురించిన వివరాలందజేస్తూ.

మురళీమోహన్, జయచిత్ర, గుమ్మడి



'రాజా'లో శోభన్‌బాబు, అంజలీదేవి

గిరిబాబులు ఇప్పటికి ఈ చిత్రానికి ఎన్ను కొన్న నటీనటులు. క్రాంతికుమార్ 'జ్యోతి'ని అద్భుతంగాతీర్చిదిద్దిన దర్శకుడు రాఘవేంద్రరావే ఈచిత్రాన్ని రూపొందిస్తు న్నారు. ఈ చిత్రానికి సంగీతం చక్రవర్తిది, ఛాయ కె. యస్. ప్రకాష్‌ది, మాటలు సత్యానంద్‌వి.

## మంచి కాపురానికి 'సుప్రభాతం'!

దాంపత్య జీవితంలో ఎన్నో వత్తిడు లకు లోనవుతుంటారు భార్యాభర్తలు. వివేకంగా అవసరమైన మేరకు రాజీ పడుతూ తమలో ఉన్న లోపాలను సరి దిద్దుకుంటూ జీవితం సాగించడమే దాంపత్య జీవితానికి వెలుగునిచ్చి మంచి కాపురానికి 'సుప్రభాతం' పలికే కిటుకు. ఇదే 'సుప్రభాతం' కథాంశం. కృష్ణంరాజు వాణిశ్రీ, సత్యనారాయణ, జయంతి, రాజ బాబు, రమాప్రభ, అల్లు రామలింగయ్య. జి. నిర్మల, నాలుగు జంటలుగా కన్పించి పైన చెప్పిన కథాంశానికి అవసరమైన సంఘటనలు సమకూరుస్తున్నారు. మోడల్ ప్రొడక్షన్స్ పతాకం క్రింద నిర్మించబడ్డ యీ చిత్రానికి కథ, స్క్రీన్‌ప్లే దర్శకత్వం, కె. యస్. ప్రకాశరావు. నిర్మాత: కె. కృష్ణమోహనరావు, ఆత్రేయ రచన, పెండ్యాల సంగీతం, కె. యస్. ప్రకాష్ ఛాయాగ్రహణం కలిగిందీ చిత్రం.

## కొత్త దర్శకుడు!

శశికళా చిత్ర పతాకం క్రింద బాలినేని వెంకటేశ్వరరెడ్డి నిర్మించే చిత్రం ద్వారా యు. యస్. వి. పాజి తెలుగు ప్రేక్షకులకు దర్శకుడిగా పరిచయమవుతున్నాడు. దర్శ



'బంగారక్క'లో అల్లు రామలింగయ్య, రమాప్రభ

కుడు తాతినేని ప్రకాశరావుకు సహకార దర్శకుడుగా పనిచేసి విశేషానుభవం గడించిన ఈ నవ దర్శకుడి చేతిలో రూపొందుతున్న యీ చిత్రంలో రామకృష్ణ, జగ్గయ్య చంద్రమోహన్, చంద్రకళ, ప్రభ మొదలైనవారు నటిస్తున్నారు.

## మాదైవం!

ప్రముఖ హిందీ నిర్మాత, దర్శకుడు శాంతారాం నిర్మించిన 'దో ఆంఖే బారా హాత్' చాలా చక్కటి చిత్రంగా ప్రవేశించబడి అంతర్జాతీయ చలన చిత్రోత్సవాలలో పెక్కు బహుమతులు కూడా అందుకుంది. ఇది ఎన్నో సంవత్సరాల క్రితం జరిగిన సంగతి. ఇప్పుడు ఆ చిత్రం ఆధారంగా మారిన సాంకేతిక విలువల కనుగుణంగా మారుతున్న అభిరుచుల కనుగుణంగా రూపొందించబడిన చిత్రం 'మా దైవం' జెమినీ ఎస్. ఎస్. బాలన్ స్క్రీన్‌ప్లే సమకూర్చి దర్శకత్వం వహించిన ఈ చిత్రానికి నిర్మాతలు మణియన్, విద్వాన్ లక్ష్మణన్. ఉదయం ప్రొడక్షన్స్ పతాకం క్రింద నిర్మించబడిన ఈ చిత్రంలో ఎన్. టి. రామారావు, జయచిత్ర (తొలిసారిగా ఎన్. టి. ఆర్ సరసన నటిస్తోంది) నాగభూషణం, ప్రభాకర రెడ్డి, పద్మనాభం, త్యాగరాజు, భీమరాజు, ఎం. ఎన్. నంబియార్, గిరిబాబు, కె. వి. చలం, రాజనాల మొదలయినవారు నటించారు. ఈ చిత్రానికి మాటలు డి. వి. నరసరాజు సమకూర్చారు, సంగీతం: కె. వి. మహదేవన్ నిర్వహించారు.



'లంబాడోళ్ళ రాందాసు'లో
జయలక్ష్మి, నరసింహరాజు

## చింతకుచిగురు మనిషికి....?

మనిషికి పొగరుండాలి. మనిషి పొగరుబోతుగా బ్రతకాలి. అయితే ఆ పొగరుబోతు గుణం మంచిని పెంచేందుకూ, మంచిని కుంచేందుకు ప్రయత్నిస్తున్న పొగరుబోతుల నణిచేందుకు ఉపయోగపడాలి, 'పొగరుబోతు' వర్ణచిత్ర కథానాయకుడి గుణం అదే. మనిషి మంచివాడు. కాని అన్యాయాల్ని చూస్తూ సహించలేడు. పొగరుబోతై తిరగబడతాడు,

"పొగరుబోతు"గా శోభన్‌బాబు నటించిన యీచిత్రం దర్శకుడు తాతినేని ప్రకాశరావు సృష్టి. సత్యనారాయణ, గుమ్మడి, రాజబాబు, రావూజీ, అల్లురామలింగయ్య. మాడా, సూర్యకాంతం, సుధ, విజయలక్ష్మి, రాజేశ్వరి, హలం కూడా నటించిన ఈ చిత్రానికి కథానాయిక వాణిశ్రీ. భమిడిపాటి రాధాకృష్ణ రచన, యస్. వెంకటరత్నం ఛాయ, కె. వి. మహదేవన్ సంగీతం గల ఈ చిత్రానికి కో డైరెక్టర్: టి. యల్. వరప్రసాద్ బి. ఏ.

## మిగతా కథ వెండితెరపై!

కోటీశ్వరుడు చక్రవర్తి కూతురు రేఖ. రేఖను ప్రేమించినవాడు ఇంజనీర్ శేఖర్. మీ ఆస్థి నాకొద్దు. నేషనల్ ఫండ్స్‌కి విరాళంగా యిచ్చెయండి. నా సంపాదన మా ఇద్దరి సుఖజీవనానికీ సరిపోతుంది చక్కగా అని శేఖర్ అనడంతో చక్రవర్తికి మండుకొచ్చింది. నా కూతురిని నీ కివ్వను ఫో అనేశాడు. శేఖర్ తల వంచుకొని వెళ్ళలేదు. తలెత్తి "బ్రతికుండగానే మీరు మా పెళ్ళి చూస్తారు" అని

'అమెరికా అమ్మాయి'లో దేవయాని





'జడ్జిగారి కోడలు'లో
జయప్రద, రామకృష్ణ

సవాల్ చేశాడు. అయితే సవాలు చేసిన శేఖర్‌పై అన్యాయంగా ఓ నేరం ఆపాదించబడి జైలుపాలయ్యాడు. ఆ తర్వాత కథకోసం మీరు కంచి కెళ్ళొద్దు. మీ ఊరి వెండితెరపై "దొంగల దోపిడి" వర్ణ చిత్రం చూస్తే చాలు. "దొంగల దోపిడి"లో కృష్ణ, మంజుల, ప్రభాకరరెడ్డి, మిక్కిలినేని, త్యాగరాజు, మోహన్‌బాబు, నాగభూషణం, పద్మనాభం, కె.వి. చలం, జయమాలిని మొదలైన వారున్నారు. కె. ఎస్.ఆర్. దాసు దర్శకత్వంలో త్రిమూర్తి ప్రొడక్షన్స్ నిర్మించిన ఈ చిత్రానికి నిర్మాతలు జి. సాంబశివరావు, పి. బాబ్జీ.

## భరణీవారి కొత్త చిత్రం!

భరణీ పిక్చర్స్ నిర్మించిన కొత్త చిత్రం పేరు "మనవడి కోసం" మనవడి కోసం తపించిపోయిన ఓ నాన్నమ్మ కథను తమాషాగా మలచి కంటతడి పెట్టిస్తూ, కడుపుబ్బ నవ్విస్తూ రూపొందించబడ్డ యీ చిత్రానికి స్క్రీన్‌ప్లే, సంగీతం, దర్శకత్వం భానుమతీ రామకృష్ణ నిర్వహించారు.

## తూర్పు - పడమర!

నిర్మాత రాఘవ, దాసరి నారాయణరావు దర్శకత్వంలో నిర్మించిన చిత్రం "తూర్పు-పడమర" సెప్టెంబర్‌లో విడుదల చేయబోతున్నారు. సత్యనారాయణ, శ్రీవిద్య, నరసింహరాజు, నూతన నటి మాధవి ప్రధాన పాత్రలలో నటిస్తున్న ఈ చిత్రం ప్రయోగాత్మకమైంది. ప్రేక్షకులకు కొత్తతరహా చిత్రాన్ని చూశామన్న అనుభూతిని కల్గించే దీ చిత్రం.

'పాడవోయీ భారతీయుడా!'లో
శ్రీదేవి





'ఒకే రక్తం'లో పండరీబాయి, జయప్రద

## మనిషి రోడ్డున పడ్డాడు!

పేరులో కొత్తదనాన్ని చూపించే యీ చిత్రానికి కథ రాజబాబు సమకూర్చారు. బాబ్ అండ్ బాబ్ రిక్రియేషన్స్ నిర్మించిన యీ చిత్రానికి చలన చిత్ర రంగంలో పదిహేనేళ్ళకు పైబడి వివిధ శాఖలలో అనుభవం గడించినవాడూ, రచయితగా పాఠకుల గుండెలు కెలికేటంతటి బలమైన రచనలు చేసినవాడూ, ఉత్సాహవంతుడూ, ఆలోచనాపరుడూ సి. వి. రమణ దర్శకత్వం వహించారు. లాభాపేక్షతో కాక మిత్రులకు అవకాశాలివ్వడానికీ, ఒక మంచి చిత్రాన్ని నిర్మించామన్న తృప్తి కోసమూ తామీ చిత్రాన్ని తలపెట్టామంటున్నారు. యీ చిత్రాన్ని సమర్పిస్తున్న రాజబాబు. రాజబాబుతోపాటు, సత్యనారాయణ, రావుగోపాలరావు, రంగనాథ్, నాగభూషణం, ప్రభాకరరెడ్డి, కాకరాల, చిట్టిబాబు, సత్తిబాబు, కృష్ణకుమారి, నిర్మల, రాధాకుమారి, రమోలా, గిరిజారాణి నటించిన యీచిత్రంలో నూతన నటుడు విజయ్ బాబు, నూతన నటి జయశుభలు నాయకా నాయికలుగా పరిచయం చేయబోతున్నారు.

## నాటక ప్రదర్శన

ఆగస్టు 21 వ తేదీన శ్రీరాళ్ళపల్లి వ్రాసిన "ముగింపులేని కథ" అనే నాటకం శ్రీ మురళీ కళా నిలయం, సికిందరాబాదు వారిచే మద్రాసు వాణీ మహల్లో ప్రదర్శించబడింది. ఈ నాటకం యితివృత్తం 20వ శతాబ్దానికి చెందిన ఇద్దరు మధ్య తరగతికి చెందిన గుమాస్తాల కథ. 17వ శతాబ్దంలో గురువు(Ch.సత్యనారాయణ) శిష్యుడు (Ch. నాగేశ్వరరావు) తమ కాశీ ప్రయాణంలో యీ కథను చెప్తాడు.

ఎంతసేపు మన నిత్యజీవితపు టవసరాలు- వాటి ఆర్థిక యిబ్బందుల్లో నలిగిపోతున్న ఇద్దరి కథ. యిక అన్నీ యీ నాటి అన్ని కుటుంబాలలోనూ జరుగుతున్న అవకతవ కలే!మంచి కథను ఎన్నుకొని-చక్కటి డైలాగ్సు రాశారు శ్రీ రాళ్ళపల్లి.

ఈ నాటకంలో పాల్గొన్న నటనటుల 'టీమ్‌వర్క్' యీ నాటక విజయానికి కారణం.

చాలా కాలం తర్వాత మద్రాసులో ఒక మంచి ప్రదర్శన చూశామన్న తృప్తి కలిగిందందరికీ।

---

'స్నేహబాల' పిల్లల పత్రిక పిల్లల అందాలపోటీ నిర్వహించి విజేతలకు 'బాలరాజు', 'బాలరాణి' బిరుదులిచ్చి సత్కరించింది. బహుమతి ప్రదానం సందర్భంగా జరిగిన సభకు ప్రముఖ రచయిత శ్రీ ధనికొండ హనుమంతరావు అధ్యక్షత వహించారు. 'బాలరాజు'కు కిరీటాలంకరణ సినీనటుడు శోభన్ బాబు 'బాలరాణి'కి కిరీటాలంకరణ సినీనటి కుమారి రాజశ్రీ చేశారు. సభికులకు స్నేహబాల సంపాదకులు శ్రీ వాయుని కృష్ణమూర్తి స్వాగతం పలుకగా, శ్రీలాల్ వందన సమర్పణ చేశారు. క్రింది చిత్రాలలో శ్రీ ధనికొండ హనుమంతరావు, బాలరాణి (కె. హిమబిందు)తో శ్రీ శోభన్ బాబు, బాలరాజు (కె. విజయేంద్ర)తో కుమారి రాజశ్రీలను చూడగలరు.



సంక్షిప్త సమాచారము:

* నిర్మాత రామానాయుడు కృష్ణ కథానాయకుడుగా "సాహసగాళ్ళు" చిత్రం నిర్మిస్తున్నారు. బోయిన సుబ్బారావు దర్శకుడుగా పరిచయం అవుతున్నాడీ చిత్రం ద్వారా.
* నిర్మాత యం. యస్. రెడ్డి రంగుల్లో నిర్మిస్తున్న చిత్రం పేరు "ముత్యాల పల్లకి" బి. వి. ప్రసాద్ దర్శకుడు. జగ్గయ్య, నారాయణరావు, రాజ్‌బాబు, జయసుధ, రోజారమణి, మమత మొదలైనవారు నటిస్తున్నారు.
* శ్రీ దేవి ఆర్ట్ పిక్చర్స్ సంస్థ పి. చంద్రశేఖరరెడ్డి దర్శకత్వంలో "పల్లెసీమ" చిత్రాన్ని నిర్మిస్తోంది. రంగనాథ్, శ్రీధర్, గుమ్మడి, ప్రభాకర రెడ్డి, శరత్‌బాబు, జయసుధ, సత్యప్రియ, అపర్ణ మొదలైనవారు నటిస్తున్నారు.
* చక్రవర్తి దర్శకత్వంలో షావుకారు జానకి, ప్రభ, చలం, సత్యనారాయణ, నాగభూషణం, దేవదాసు, మాడా నటీనటులుగా తయారైంది "అదృష్టవంతురాలు" జగదీష్ కృష్ణప్రసాద్ నిర్మాత.
* శ్రీ వాణీ ఆర్ట్ కంబైన్స్ వారి "ఒకే రక్తం" విడుదలకు సిద్ధంగా ఉంది. నిర్మాత ఎన్. వి. సుబ్బరాజు, కృష్ణంరాజు, సత్యనారాయణ, ప్రభాకరరెడ్డి, గీతాప్రసాద్, కె. విజయ, పండరీబాయి నటించిన ఈ చిత్రంలో కథానాయికగా జయప్రద నటించింది. దర్శకుడు: పి. చంద్రశేఖరరెడ్డి.
* తెరపై ఎన్నోరకాల నృత్యప్రదర్శనలిచ్చిన జయమాలిని, నిజ జీవితంలో నాట్యం భరత నాట్యంలో "అరంగేట్రం" ఆగస్ట్ 25న మద్రాసులో యిచ్చింది.
* పి. డి. ప్రసాద్ దర్శకత్వంలో తయారైన "పెద్దన్నయ్య" విడుదలకు సిద్ధమైంది. అప్పుదాస్ నిర్మించిన యీ చిత్రంలో జగ్గయ్య, రంగనాథ్, సంగీత, ప్రభ, రాజబాబు, ప్రభాకర రెడ్డి, రావుగోపాలరావు మొదలైనవారు నటించారు.
* కె. కామేశ్వరరావు దర్శకత్వంలో పింజల సుబ్బారావు నిర్మిస్తున్న రంగుల చిత్రం "సీతారామ వనవాసం" పదిరీళ్ళకు పైన తయారయింది.
* కె. యస్. రెడ్డి దర్శకత్వంలో మురళీకృష్ణ మూవీస్ నిర్మించిన "సీతమ్మ సంతానం"లో చలం, నాగభూషణం, ప్రభాకరరెడ్డి, జయసుధ, రోజారమణి, పండరీబాయి, హేమలత మొదలయినవారు నటించారు.
* విజయభాస్కర్ ప్రొడక్షన్స్ "పాడవోయి భారతీయుడా" దాసరి నారాయణరావు దర్శకత్వంలో తయారైన చిత్రం. సెప్టెంబరులో విడుదలవుతున్న ఈ చిత్రంలో సత్యనారాయణ, కాంతారావు, త్యాగరాజు, ఈశ్వరరావు, శ్రీదేవి, గుమ్మడి, రమాప్రభ, గిరిజారాణి, విజయభాను మొదలైనవారు నటిస్తున్నారు.

—యస్వీనారాయణ.

## శ్రీశ్రీ నిర్వహించు
# పదబంధప్రహేళిక

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | ■ | 3 | ■ | 4 | | 5 |
| | ■ | 6 | 7 | ■ | 8 | | ■ | |
| 9 | 10 | ■ | 11 | | | ■ | 12 | |
| ■ | 13 | 14 | | ■ | 15 | 16 | | ■ |
| 17 | ■ | | ■ | | ■ | | ■ | 19 |
| ■ | 20 | | 21 | ■ | 22 | | 23 | ■ |
| 24 | | ■ | 25 | | | ■ | 26 | 27 |
| | ■ | 28 | | ■ | 29 | 30 | ■ | |
| 31 | | | ■ | 32 | ■ | 33 | | |

### ఆధారాలు

#### అడ్డం

1 సరదా

4 స్వగతం

6 కొన్ని భాషలకిదిలేదు.

8 వింటికీ, ఇంటికీ।

9 ఢిల్లీ, లేక సిమ్లాలో అక్కసు

11 కోటిలో వంద

12 ఒక బిరుదం కవిసమ్—

13 నాగరిక దేశాల్లో మొలిచేది

15 నువ్వు పెట్టేది నీకు వినిపించదు

20 కృష్ణకి ఉంది, గోదావరికి కూడా.

22 అయినదానికి విరుద్ధం

24 సంఖ్యలు శరీరభాగం

25 పొడుగ్గా అగు

సెప్టెంబరు నెల పదబంధ ప్రహేళికను ఒక్క తప్పుకూడా లేకుండా పూర్తిచేసి పంపినవారి సంఖ్య తొమ్మిది. వీరిలో డా॥చందు సుబ్బారావు, (లెక్చరర్,జియోఫిజిక్స్ ఆంధ్రా యూనివర్శిటీ, వాల్తేరు) తెలుగు నిఘంటువు బహుమతి గెలుచుకొన్నారు. ప్రహేళికకు సరైన పరిష్కారాన్ని పంపిన మిగతా ఎనిమిది మందికీ అక్టోబరు నెల "జ్యోతి" ఉచితంగా పంపబడుతుంది. ఆ ఎనమండుగురి పేర్లూ క్రింద ఇస్తున్నాము.

శ్రీ తాజీప్రసాద్, మద్రాసు; శ్రీమతి జి. శేషారత్నం, కాకినాడ, శ్రీ ఎన్. ఉదయభాస్కర్, భోపాల్, డా॥ ఎం. శ్రీనివాసశర్మ, త్రివేంద్రం; శ్రీ పి. ఎస్. గోపాలకృష్ణ, మద్రాసు; శ్రీ పి. సత్యనారాయణ, మంచిర్యాల సిమెంట్ వర్క్స్; శ్రీ కె. పాండురంగనాయుడు, హైదరాబాదు; శ్రీ బి. కె. హనుమంతరావు, లక్కవరం,

[గమనిక' జ్యోతిలోని ప్రహేళికనే నింపి ఆ పేజీ పూర్తిగా పంపాలి. కవర్లపై 'పదబంధ ప్రహేళిక శీర్షిక'కు అని స్పష్టంగా రాయాలి. సరైన పరిష్కారానికి తెలుగు నిఘంటువు బహుమతి. పరిష్కర్తల సంఖ్య ఒకటికంటే ఎక్కువ ఉన్నప్పుడు లాటరీ ద్వారా ఒక్కరికే బహుమతి ఇవ్వబడుతుంది. ఎంట్రీలు చేరవలసిన ఆఖరు తేదీ 1-1? 78]

ఆగస్టు నెల 'పదబంధ ప్రహేళిక' సమాధానం 111-వ పేజీలో చూడండి.

---

26 దీన్ని కొందరు పందిని చేయగల సమర్థులు
28 ఆహారం ఈ ఆధారం
29 ఇరుకైన దిక్కులలో ప్రవహిస్తుంది
31 మంచి చెబితే " " అంటాడు మూర్ఖుడు
33 ఏక వచనంలో 14.

## నిలువు

1 ఉపన్యసించడానికి
2 ఆకలిచ్చే అంబలివంటిది
4 అంతరిక్షంలో సమయం
5 ఇది పెరుమాళ్ళకెరుక
7 అరటికీ, అయ్యవారికీ ఉండేది
8 పద్యానికి పాదాలు
10 శిఖికి వికృతి
12 పూర్ణిమ రావడం
14 ఏలినవారి పులుసులో ఎవరూ స్నేహితులు కారు
16 వెన్నెల రేయి
20 నడిచే నాలుగోవంతు
21 కవితాలతలతో ఆలంబనం కోరేది
22 అంచేత
23 తిరగబడ్డ 26. గంటలు 24
24 శీతకాలం తర్వాత
27 ఆనెగొంది టవున్లో ధైర్యం
28 మేధావులు తొడిగే గౌను. ఆద్యంతాలే శరీరం
30 తూర్పు ఇదే, పడమరా ఇదే!

## ఏకాక్షర పదాలు

3 ఇటీవలి సినీమాలలో ఇంగ్లీషు నేరం
17 ఎడమ
18 సిగ్గు
19 ఈజిప్షియన్ల సూర్యదేవుడు రమ్మంటాడు

# కొత్త పుస్తకాలు

(సామాన్యుని సందేశం, (వచన కవిత) రచన: బి. ఎన్. రెడ్డి; సుకృత పబ్లికేషన్స్, హైదరాబాదు; వెల రు. 4-50 ప్రతులకు విర్గో, 6-3-1063/B/3 లకడికాపూల్, హైదరాబాద్ 500 004)

రచయిత వృత్తిరీత్యా ఆర్కిటెక్ట్. అయితే సమాజంలోని చీకటి భాగాలను చూసి వ్యధచెంది, హృదయం స్పందించగా కవితా నిర్మాణమూ చేశారు. ముప్పై నాలుగు మకుటాలున్న ఈ కవితా సంకలనంలో "మనిషి మంచిమార్గాన జీవించాలి" అన్న తపనను ప్రధానంగా వ్యక్తపరిచారు. మనిషిలోని రాక్షసగుణాన్ని ంచారు. 'నక్సలిజం' మంచిదికాదన్న కవి, కేవలం ఒక్కమాటలో నిరసించ బూనక తన భావాన్ని వివరంగా వ్యక్తపరచడం ప్రశంసనీయం. ఈ సంకలనంలోని కవితలను 'చాలా బాగా రాయబడ్డ కవితలన్న' ప్రయోగానికి వెనుకాడినా, చాలా మంచి భావమున్న కవిత లనడంలో ఏం సందేహించ నవసరం లేదు.

[తమసోమా జ్యోతిర్గమయ (నాటకం), బి. వి. రమణరావు, సాక్షి బుక్స్; వెల రు. 3-50 ప్రతులకు: నవోదయా పబ్లిషర్స్, ఏలూరు రోడ్, విజయవాడ-2.]

ఇది ప్రయోగాత్మక నాటకమే. నాటకంలో పాత్రలు ఎంతో వైవిధ్యపు స్వభావాలు గలవి. 'లైఫ్ విత్ రవి ఈజ్ వన్ లాంగ్ ఎక్సైట్‌మెంట్' అంటుంది వాణి. ఈ నాటకానికి కథా నాయకుడిగా చెప్పవలసిన రవి భార్య. ఎక్కడి కక్కడ, ఎప్పటి కప్పుడు అవసరమైన మేరకు ఎన్నో సాంకేతిక విషయాలు చర్చించడం జరిగిందీ నాటకంలో. 'లైఫ్ విత్ రవి' లాగానే ఈ నాటకం కూడా 'ఒన్ లాంగ్ ఎక్సైట్‌మెంట్' "లౌకిక భోగాలకీ, ఆధ్యాత్మిక సాధనకీ పొత్తు కుదరదన్నది దురభిప్రాయం. ఐహికం ఆధాత్మికం రెండూ జీవిత రథానికి రెండు చక్రాలు. మానవ జీవితమనే మహా యజ్ఞానికి, భగవద్విశ్వాసమనే హోమగుండంలో సకల కర్మలనీ సమిధలుగా ఆహుతి చెయ్యడమే మనిషి కర్తవ్యం. ఫలితంగా ఆనందాన్నీ, శాంతినీ భగవంతుడే అందిస్తాడు" ఈ అభిప్రాయం వ్యక్తపరుస్తాడు చివర నాయకుడు రవి. అతనా అభిప్రాయానికి రావడానికి కారణంగా నాటకంలో సంఘటనలు నిలుస్తాయి. చదివినా, చూచినా కేవలం చదవడం, చూడటం మాత్రమే గాక 'ఆలోచించడం' కూడా తప్పని సరి చేస్తుందీ నాటకం.

[ఇది మాతరం కథ (నవల); బి. కృష్ణవేణి; నవయుగ బుక్ సెంటర్, ఏలూరు రోడ్, విజయవాడ-520 002; వెల. రూ. 6-/]

'కాలక్షేపంగా చదువుకోవడానికే పనికొచ్చే' నవలలు చాలా వస్తున్న కాలం ఇది. 'ఇదిమాతరం కథ' కాలక్షేపంగా చదువుకోవడానికి పనికొచ్చే నవలేగాక, మనిషిలో ఆలోచనా భాగాన్నీ కదిలించేందుకు ప్రయత్నమూ చేసింది.

కాలేజీలో ఒక విద్యార్థికి అన్యాయం జరిగిన కారణంగా జరిగిన సమ్మె ఆకాలేజీ-

కమిటీ ప్రెసిడెంటు వెంకట్రావుకు చాలా ఇబ్బందిని కల్గిస్తుంది. అంతేకాక ఆ సమ్మెకు నాయకత్వం వహించిన వారిలో తన కొడుకు భద్రం కూడా ఉండంతో ఆయనకు మరీ చిరాకు తెప్పిస్తుంది. 'వ్యవహార వేత్త'గా వెంకట్రావు వేసిన పథకాల కనుగుణంగా కథ అనుకోని మలుపులు తిరుగుతుంది. భద్రం మద్రాసులో మేనమామ గారింట బందీ అవుతాడు. భద్రం ప్రేమించే విమల వెంకట్రావుగారి భార్య అవుతుంది. మద్రాసు నుంచి తప్పించుకొన్న భద్రం ఎక్స్ట్రీమిస్ట్స్ (సమాజంలో అమాయకపు ప్రజలను పీడించి వారి అస్థిపంజరాల మీద మేడలు కట్టే కొద్దిమంది దోపిడీదారులను హతమార్చి ఆ దోపిడీ [illegible]మూలంగా [illegible] [illegible]ప్పించుకున్న అరివీర భయంకరుల బృందం)లో చేరిపోతాడు. విమల అన్న విశ్వం వెంకట్రావు మిల్లులో జరుగుతున్న అన్యాయాలను ఎదిరించే ఉద్యమానికి నాయకుడై ఆ ప్రయత్నంలో ప్రాణాలే పోగొట్టుకొంటాడు. కథాంతాన కన్న తండ్రినే బెదిరించేందుకు ముసుగులో వచ్చిన భద్రాన్ని కొడుకని తెలియక పొడుస్తాడు వెంకట్రావు. 'ఆత్మరక్షణ'కు భద్రం తుపాకీ కాల్చగా వెంకట్రావూ మరణిస్తాడు. ఇది కథ.

కథలో అంతర్గతంగా కన్పించేది, 'దోపిడీవర్గాల' అన్యాయాల నెదిరించాలన్న సూచన. కాని ఆ ప్రయత్నం ఎంత వరకు సఫలమయిందనేది ఆలోచించవలసిందే.

విశ్వం పాత్రగానీ, భద్రం పాత్రగానీ ఒక బలమైన కన్విక్షన్‌తో తమ మార్గాన్నెన్నుకోలేదనిపిస్తుంది. కథా కదలడం కోసం వారావైపు మలచబడ్డారన్న భావం కలుగుతోంది. వారిద్దరి వ్యక్తిత్వ చిత్రణ మరింత బలంగా ఉండవలసింది. 'కథాంశం' కాలక్షేపపుది కాకపోయినా, కథాచిత్రణలో 'ఫ్రస్ట్రేషన్' ఆకర్షణకు లొంగిపోయినట్లు కన్పిస్తుంది నవల. అయితే కేవలం 'ఉబుసుపోక కోసం' కాని నవల రచించిన రచయిత్రిని తప్పక అభినందించాలి.

ఈ గ్రంథంలో ఈ రచయిత్రి రచించిన చిన్న నవలిక 'జూదం' కూడా ప్రచురించబడింది.

—'భవాని'

---

## ఆగస్టునెల 'పదబంధ ప్రహేళిక'కు సమాధానం.

అడ్డం :—1. వినత, 4. లవలి, 6. తిల, 8. అబ్ధి, 9. నిఘా, 11. యయాతి, 12. మీాలు, 13. టీకాలు, 15. వరద, 20. సంజీవి, 22. నినదం, 24. ఆఖ్య, 25. పుష్పాడి, 26. డంబం, 28. బాల, 29. వినా, 31. యమున, 33. నివురు.

నిలువు :—1. విధిని, 2. తతి, 4. లబ్ధి, 5. లిప్తలు, 7. లయలు, 8. అతివ, 10. ఘాటీ, 12. మీాద, 14. కాహోజి, 16. రచన, 20. సంఖ్య, 21. విపుల, 22. నిడివి, 23. దండం, 24. ఆత్రేయ, 27. బంగారు, 28. బాన, 30. నాని.

ఏకాక్షర పదాలు :—3. క్రౌ, 17. స్త్రీ, 18. లు, 19. పో, 32. నా

